Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 2 • 21-1-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



● కేంద్ర మంత్రివర్గ విస్తరణలో

# ఆంధ్రుల ఆత్మగౌరవాన్ని దెబ్బతీశారు!

ఆంధ్ర వ్యవహారాలలోనే కాదు, దేశ రాజకీయాలలో సైతం కాంగ్రెస్ పార్టీ ఎంతటి గందరగోళ పరిస్థితులలో కొట్టుమిట్టాడుతున్నదీ అర్థం చేసుకోవడానికి ఒక ఉదాహరణ తాజాగా జరిగిన కేంద్ర మంత్రివర్గ విస్తరణ. కొండంత రాగం తీసి చివరన తుమ్మెద పదం పాడినట్లు, మొత్తం మంత్రివర్గాన్ని ప్రక్షాళన చేస్తున్నామని, అవినీతి ముద్ర పడిన పది మంది మంత్రులకు ఉద్వాసన పలుకుతున్నామని, యువకులకు ప్రవేశం కల్పించి కొత్త వూపిరి పోస్తున్నామని విస్తృతంగా ప్రచారం చేసి, తీరా ప్రమాణ స్వీకారానికి వచ్చేసరికి తూతూ మంత్రంగా ముగ్గురు అనామకులకు మంత్రిపదవులిచ్చి సరిపెట్టేశారు.

మన రాష్ట్రం విషయంలో మాత్రం చాలా పెద్ద తప్పటడుగు వేసింది కాంగ్రెస్ నాయకత్వం. రాష్ట్రం నుంచి ఒక్కరికి కూడా అవకాశం లేకుండా విస్తరణ జరిపించారు. ఒకవైపు తెలంగాణ ఉద్యమం వేడి, మరొకవైపు జగన్ తాకిడి సెగ కమ్ముకొని వున్న వాతావరణంలో పార్టీకి జవసత్వాలు కల్పించడానికి సమర్థులైన నేతలను గద్దె ఎక్కిస్తారని అందరూ భావించారు. ఐదు నుంచి ఆరు మంది ఆంధ్ర నేతలకు మంత్రిపదవులు దక్కుతాయన్న ప్రచారం జరిగింది. కానీ అదంతా వుత్తిదే అని తేలిపోయింది. పదవుల కోసం ఎంతో ఆశతో ఆరాటపడిన ఆంధ్ర ఎమ్పీలు గాలి తీసేసిన బెలూన్ల వలె ఒక్కసారిగా చతికిల పడిపోయారు.

మన రాష్ట్రం నుంచి 33 మంది కాంగ్రెస్ ఎమ్పీలు గెలిచారు. వారిలో ఒకటికి నాలుగుసార్లు గెలిచిన సీనియర్లు కూడా వున్నారు. వైఎస్.రాజశేఖర్ రెడ్డి బ్రతికి వున్న కాలంలో, కేంద్ర నాయకత్వం ఆయన గీచిన గిరి దాటేది కాదు. స్వంత బలం కల్గిన నాయకులు కేంద్రంలో మంత్రులుగా వుంటే, తనకు ఇబ్బందులు సృష్టిస్తారనే భయంతో వైఎస్, సోనియాకు నచ్చ చెప్పి, రాజకీయంగా స్వంత సత్తా ఎంత మాత్రం లేని పనబాక లక్ష్మి, పురంధేశ్వరి, పళ్లంరాజు, సాయిప్రతాప్ వంటి వారికి మంత్రి పదవులిప్పించారు. ఇప్పుడు వైఎస్ లేడు. పైగా వైఎస్ కుటుంబం వల్ల రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ అస్థిత్వ ప్రమాదం ఎదుర్కొంటున్నది. ముఖ్యమంత్రిగా కిరణ్‌కుమార్‌రెడ్డి వైఫల్యం వల్ల రాష్ట్రంలో రాజకీయ అనిశ్చిత స్థితి నెలకొని వుంది. రేపటి ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ పూర్తిగా తుడిచి పెట్టుకొని పోవడం ఖాయం అన్న భావన ప్రబలంగా వుంది. ఈ నేపథ్యంలో సోనియాగాంధీ చేసిన తప్పులు దిద్దుకోవడానికి ప్రయత్నిస్తారని అందరూ భావించారు. కానీ మంత్రివర్గ విస్తరణ అందుకు విరుద్ధంగా జరిగింది.

### విధేయతే బలహీనతా?

ఆరంటే ఆరుగురు ఎమ్పీలున్న కర్నాటకలో విదేశీ వ్యవహారాల వంటి కీలక శాఖతో సహా, నలుగురికి కేంద్రంలో స్థానం కల్పించారు. కానీ 33 మంది వున్న ఆంధ్రలో ఒక్క జైపాల్‌రెడ్డికి మాత్రమే క్యాబినెట్ హోదా కల్గిన మంత్రిత్వం ఇచ్చారు. ఇది అన్యాయమని గత ఒకటిన్నర సంవత్సరంగా నెత్తీ నోరు బాదుకొంటున్నారు ఆంధ్ర ఎమ్పీలు. కానీ ఆ గోడు సోనియాగాంధీ చెవికి ఎక్కడం లేదు. అందుకు కారణం ఆంధ్ర కాంగ్రెస్ వాదులు అధిష్టానం

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




'మా తెలుగు తల్లికి' మరచిపోయారట సార్!

## నెల్లూరులోనూ సి.కళ్యాణ్ బినామీ ఆస్తులు!

మద్దెలచెరువు సూరి హత్య కేసుతో వెలుగులోకి వచ్చిన సినీ నిర్మాత సి.కళ్యాణ్ బినామీ ఆస్తులు నెల్లూరులోను పెద్ద ఎత్తున బయటపడుతున్నాయి. సూరి హంతకుడిగా భావిస్తున్న భానుతో చేతులు కలిపి, రౌడీ సెటిల్‌మెంట్ల ద్వారా హైదరాబాద్‌లో కళ్యాణ్ కోట్లాది రూపాయల అక్రమ ఆస్తులు ఆర్జించినట్లు బయటపడింది. కళ్యాణ్ స్వస్థలం నెల్లూరు కాబట్టి ఇక్కడ కూడా అటువంటి ప్రయత్నాలేవైనా వున్నాయా అన్న కోణంలో ఆరా మొదలు పెట్టిన పోలీసులకు చాలా ఆస్తులే కనపడినట్లు తెలుస్తున్నది. స్టోన్‌హౌస్ పేటకు చెందిన గుప్తా అనే స్థానికుడిని తన బినామీగా పెట్టుకొని, కళ్యాణ్ నెల్లూరులో చాలా వ్యాపారాలే చేస్తున్నాడు. దాదాపు

కొరవ 14వ పేజీలో

# జనం చావాలా?

కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వం ఉద్దేశం ఏమిటో అర్థం కావడం లేదు. గత రెండేళ్లగా పెరుగుతున్న నిత్యావసర వస్తువుల ధరలు చూస్తే, ఆకలి చావులతో పేద జనాన్ని సామూహికంగా చంపడంద్వారా పేదరికాన్ని నిర్మూలించాలన్న కుత్సి తమేదో వారి ఆంతర్యంలో వుందా అన్న సందేహం కల్గుతున్నది. బియ్యం, పప్పు, ఉప్పు, నూనె, కాయగూరలు, చివరకు ఎరగడ్డలు కూడా పేద వాడికి ప్రియమైపోయే పరిస్థితులు నెలకొంటున్నాయి. కూరతో అన్నం తినడం సంపన్నుల విలాసంగా మారి పోతున్నది. గంజి నీళ్లలో ఎరగడ్డ, మిరపకాయ నంజుకొని తినే పాతకాలం నాటి పేదరికపు అలవాటు కూడా ఖరీదైన వ్యవహారంగా తయారౌతున్నది. ఏ వస్తువూ తినేట్లు లేదు, కొనేట్లు లేదు.

మరొకప్రక్క అదే నిత్యావసర వస్తువులు పండించే రైతు బ్రతుకు నానాటికీ దుర్భరంగా మారుతున్నది. గత ఏడాది పుట్టి వడ్లు 15వేల రూపాయలమ్మితే, ఈ ఏడాది 8 వేలకు కొనే దిక్కు కన్పించడం లేదు. కానీ బజారులో బియ్యం మాత్రం కిలో నలభై రూపాయలకు పెరిగిపోయాయి. కాయగూరలు పరిస్థితీ అంతే. రైతు దగ్గర కూటి నీళ్లకు కొంటున్న వ్యాపారులు, మార్కెట్‌లో బంగారు కంటే ప్రియమైన ధరలకు అమ్ముకొంటున్నారు.

ఈ ధరలు ఇంతగా పెరిగిపోవడానికి ప్రభుత్వ విధానాలే కారణం అన్నది వాస్తవం. ఆర్థిక సంస్కరణల పేరిట మన్మోహన్ సర్కారు అవలంభిస్తున్న పెట్టుబడిదారీ ఆర్థిక విధానాలు ప్రజల జీవితాలను దుర్భరం చేస్తున్నాయి. బ్రతకడమే కష్టంగా మారుస్తున్నాయి. అమెరికన్ పెట్టుబడిదారుల ఒత్తిడికి తలొగ్గి, స్టాక్ మార్కెట్‌లో షేర్ల వలె నిత్యావసర వస్తువులకు ఫ్యూచర్స్ ఎక్ఛేంజ్ ప్రవేశపెట్టాడు ప్రధాని. ఎక్కడో న్యూయార్క్‌లో కూర్చుని వున్న వ్యాపారి, ఇక్కడ భారతదేశంలో ఎరగడ్డలకు, పప్పుదినుసులకు, నూనె గింజలకు ధరలు నిర్ణయిస్తున్నాడు. గింజ ధాన్యం కొనకుండా కాగితాల మీద వేల కోట్ల రూపాయల విలువ చేసే వస్తువులను కొని అమ్ముతున్నారు. ఆ స్పెక్యులేషన్ వ్యాపారం వల్లనే దేశంలో నిత్యావసర వస్తువులు సామాన్య ప్రజలకు అందుబాటులో లేకుండా కొండెక్కి కూర్చుంటున్నాయి.

మరొకప్రక్క కేంద్ర ప్రభుత్వం పెట్రోల్ ధరలకు అనుసరిస్తున్న విధానం ప్రజల పాలిట శాపంగా పరిణమిస్తున్నది. గత ఏడాది కాలంలో ఐదుసార్లు పెట్రోల్ ధరలు పెంచింది ప్రభుత్వం. ఇప్పుడు తాజాగా మరొకసారి లీటర్‌కు మూడు రూపాయల ధర పెంచింది. మోటార్ సైకిల్‌ను తమ ప్రయాణ సాధనంగా వినియోగించే కోట్లది మంది మధ్యతరగతి ప్రజలు ఈ పెరిగిన పెట్రోల్ ధరతో అల్లాడి పోతున్నారు.

ప్రజలకు రాబడి పెరిగి, అవసరం కంటే ఎక్కువగా తినడం వల్లనే ధరలు పెరుగుతున్నాయని ప్రకటించాడు ప్రధానమంత్రి సమాచార సలహాదారుడు. అంతకంటే కడుపు మండించే వ్యాఖ్య వేరొకటి వుండదు. ప్రభుత్వాన్ని నడిపే పెద్దలకు ప్రజల పట్ల ఎంతటి చులకన భావం వుందో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. పేద ప్రజలు కడుపు నిండా అన్నం తినడమే పాపం అన్నట్లు పాలకులు మాట్లాడడం ఆర్థిక సంస్కరణల పేరుతో దేశానికి దిగుమతి అయిన విష సంస్కృతికి ఒక ఉదాహరణ. పెరిగే జనాభాకు అనుగుణంగా ఆహార పదార్థాల ఉత్పత్తి పెంచడం, అది వీలు కాకుంటే ప్రజా సంక్షేమ లక్ష్యంతో ఎగుమతి దిగుమతి విధానాలు రూపకల్పన చేసి, ఆ పదార్థాలు అందుబాటులో వుంచడం ప్రభుత్వ కర్తవ్యం. ఆ బాధ్యతను విస్మరించి, ప్రజలు అన్నం తినడమే నేరమన్నట్లుగా భావించే ప్రబుద్ధులు ఒక్కరోజు కూడా ప్రభుత్వంలో కొనసాగడానికి అర్హులు కారు. సమాజంలో అతి స్వల్ప శాతం సంపన్నులను మరింత కుబేరులుగా మార్చే ఆర్థిక సంస్కరణలు కావాలో, లేక అధిక శాతం ప్రజలు సుఖంగా బ్రతికే ఆర్థిక విధానాలు కావాలో కాంగ్రెస్ పార్టీ తేల్చుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. మన్మోహన్ నిజాయితీపరుడే కావచ్చు. కానీ ఆయన ఆర్థిక విధానాలు ప్రజల పాలిట శాపాలుగా మారుతున్నాయి. పేదలను మరింత పేదలుగా మారుస్తున్నాయి. తిండికి ముఖం వాచిపోయే పరిస్థితులు తెచ్చిపెడుతున్నాయి. ఇటువంటి ప్రధాని, ఆయన ఎంత నీతిమంతుడైనా సరే, దేశానికి అరిష్టం తప్ప ప్రయోజనం వుండదు. కాంగ్రెస్ పార్టీ తన ఆర్థిక విధానాలపై ఆత్మపరిశీలన చేసుకొని, ప్రజా హితమే పరమావధిగా పని చేయగల్గితే, ఒక రాజకీయపార్టీగా మిగులుతుంది. లేకుంటే, ప్రజాగ్రహానికి గురై నామరూపాలు లేకుండా పోతుంది. జనాన్ని సామూహికంగా ఆకలి చావులకు గురిచేసే దారుణ పాలనకు తక్షణం ముగింపు పలకాలన్నది దేశ ప్రజల అభిమతం.

జమీన్‌రైతు

## జనవాణి

### పార్కింగ్ స్థలాలను చూపించండి!

నెల్లూరు నగరాన్ని సుందరనందనవనంగా తీర్చిదిద్దుతామని కార్పొరేషన్ ఎన్నికల ముందు ప్రగల్భాలు పలికిన మన ప్రజాప్రతినిధులు, ఎన్నికలు, పరిపాలనా కాలం ముగిసిన తర్వాత చూస్తే ఉత్తర కుమారులుగానే మిగిలారు. దిన దినానికి పెరిగిపోతున్న నెల్లూరు ట్రాఫిక్‌నే తీసుకొంటే ప్రజలు సరిగా నడవడానికి ఫుట్‌పాత్‌లు గానీ, బండ్లు నిలుపుకోవడానికి సరైన పార్కింగ్ స్థలం గానీ లేనే లేదు. ఇది చాలదన్నట్లు నెల్లూరు ట్రాఫిక్ పోలీసులు ఏదైనా వాహనాన్ని ట్రంకురోడ్డులో పార్కింగ్ చేస్తే పట్టుకపోతున్నారు. ఇదే విషయాన్ని నేను నగర డిఎస్పీ రాధికను అడిగితే ప్రజలకు పార్కింగ్ చూపడం తమ శాఖ పరిధిలోనికి రాదన్నారు. కార్పొరేషన్ పార్కింగ్ స్థలం చూపించక, పోలీసులు తమకు సంబంధం లేదని చెబితే వాహనదారులు తమ వాహనాలను నెత్తిన పెట్టుకొని పూరేగాలా? ప్రజలు తిరగబడక ముందే కార్పొరేషన్, పోలీసు అధికారులు ఒక సంయుక్త సమావేశం ఏర్పాటు చేసుకొని నగరంలో పార్కింగ్ స్థలాలను చూపించాల్సిన అవసరం వుంది.

పి.కృష్ణారెడ్డి నెల్లూరు

### ఆరోపణలపై విచారణ ఏది?

మహిళలను లైంగిక వేధింపులకు గురి చేశాడన్న ఆరోపణలతో వివాదాస్పదుడైన విజయవాడ పోలీసు కమిషనర్ పి.సీతారామాంజనేయులుపై విచారణ చేయించకుండానే ఆయన్ను ప్రభుత్వం బదలీ చేసింది. సీతారామాంజనేయులు బెజవాడ రౌడీలను అదుపులో పెట్టిన అధికారి. ఇటువంటి వారిపై సహజంగా చాలామంది శతృత్వం పెంచుకొంటారు. ఈయనపై ఆరోపణలు చేసిన మహిళల్లో ఒకరు వల్లభనేని వంశీ బంధువు. విచారణ లేని చర్య శాంతి భద్రతలు, విధి నిర్వహణలో కరకుగా వ్యవహరించే పోలీసు అధికారుల మనస్థైర్యాన్ని దెబ్బతీస్తుంది. సీతారామాంజనేయులుకు గ్రేహౌండ్స్ విభాగంలో పోస్టింగ్ ఇవ్వడం సరైన చర్య కాదు.

సిహెచ్.హనుమంతరావు నెల్లూరు

### కూరగాయల మార్కెట్‌ను చక్కదిద్దాలి!

నెల్లూరు ఎసి కూరగాయల మార్కెట్‌లో వ్యాపారులు మహా ముదిరిపోయారు. తూకం సరిగ్గా తూయరు. కూరగాయలు ఏరుకోకూడదు. వారు చెప్పిన రేటుకే కొనుగోలు చేయాలి. ఇదేమిటంటే తుస్కారంగా మాట్లాడుతారు. ఈ విషయం మార్కెట్‌కు ఈ మాసంలో మూడుసార్లు తనిఖీకి వెళ్లిన జిల్లా పౌరసరఫ

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

26-1-1941
పేజీలు : 16 వెల: అణా

### తుగ్లక్ ప్రభుత్వం

నెల్లూరు డిఇఓ గారు తన స్వంత ఆఫీసును రాత్రి 9 గంటల దాకా పెట్టుకోవడమే కాదట బళ్ల ఇన్‌స్పెక్టర్లు కూడా రాత్రి 8 గంటల వరకూ జరిపి, 8 గంటలప్పుడు పిల్లకాయల చేత డ్రాయింగు వ్రాయించినాడట. వీరి విషయాలు వింటుంటే తుగ్లక్ జ్ఞాపకం వస్తున్నాడంటే తప్పుకాదనుకుంటా.

### రామమూర్తి గారి నిర్యాణం

ఈ నెల 23వ తేది ఆంధ్రులకు దురదృష్టదినము. మరొక ఆంధ్రజ్యోతి ఆరిపోయినది. ఆంధ్రత్వము మూర్తీభవించి వ్యవహారిక భాషావ్యాప్తికయి సేవజేస్తుండిన మహా మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ రావు సాహెబు గిడుగు రామమూర్తి పంతులు మద్రాసున దివంగతులైరిననుటకు దుఃఖించని ఆంధ్రుడుండ జాలడు. వీరి అస్తమయము ఆంధ్ర సారస్వతానికి గొప్ప దెబ్బ. గత వారంలో మద్రాసు నగరమున పత్రికా రచయిత ఇష్టాగోష్టిలో ఉపన్యసించుచు ఇవియే తుది పలుకులు అన్నప్పుడు ఎవరూ ఇటువంటి సంఘటన జరుగుతుందని ఊహించలేదు. సర్వేశ్వరుడు వీరి ఆత్మకు శాంతినొసంగుగాకయని ప్రార్థించుచూ వీరి కుటుంబానికి మా సానుభూతి తెలుపుచున్నాము.

### బ్యాంకి ప్రెసిడెంటు

రేబాల లత్సయ్య కోఆపరేటివ్ బ్యాంకి ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డాడు. అన్నీ నాకే కావాలని కౌగి లించుకోకుండా ఇసి మెంబరు పదవిని వదులుకొనైనా లత్సయ్య ప్రెసిడెంటు షిప్పును బలపరచిన వంగల్లు కోదండరామిరెడ్డి గారి సమయానుకూల ప్రవర్తన ప్రశంసార్హము.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

20-1-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ముఖ్య వార్తలు

భారత్ ఇన్సూరెన్సు కంపెనీ నిధుల దుర్వినియోగ నేరానికి రెండేళ్ల కఠిన శిక్ష విధించబడి, జైలుకు పంపబడిన కోటీశ్వరుడు శేఠ్ రామకృష్ణ దాల్మియా, సుప్రీంకోర్టులో అప్పీలు అనుమతింపబడి జైలునుండి బయటకు వచ్చాడు.

**నాలుగేళ్ల శిక్ష :** రెండు లక్షల జరిమానా విధించబడిన హరిదాస్ ముంద్రా కృష్ణ జన్మస్థానానికి పంపబడ్డాడు.

***

ఆంధ్ర జిల్లాలలోని బస్సులలో సీటుకు మూడు మాసాలకు రూ.12-8-0 వున్న పన్నును 50 రూపాయలకు పెంచుతూ చేసిన చట్టం చెల్లదని ఆంధ్ర హైకోర్టు తీర్పుజెప్పింది. బస్ యజమానుల రిట్ దరఖాస్తులపై హైకోర్టు తీర్పునిచ్చింది.

### మండలాభిమానం చావదు

స్వర్గీయ యాహ్యాలీ రూప పటావిష్కరణ సందర్భంలో మద్రాసులో తాము అప్పుడప్పుడు కలుసుకోవడాన్ని, కలుసుకున్నప్పుడు కలుగుతుండిన నెల్లూరీయులమనే ఆత్మీయతాభావాన్ని ప్రస్తావించి "ఎన్ని చెప్పినా జిల్లా అభిమానం చావదు" అన్నారు బెజవాడ గోపాలరెడ్డి.

### 38వ పర్యాయం రక్తదానం

రక్తదాత ఎస్వీ నరసింహారావు, 17వ తేది నెల్లూరు పెద్దాసుపత్రి బ్లడ్ బ్యాంకులో 38వ పర్యాయం రక్తదానం చేశారు.

# నెల్లూరు ముచ్చట్లు
విశ్లేషకుడు

## విఆర్‌సిలో స్కాలర్‌షిప్పుల స్వాహా!

నెల్లూరు విఆర్ కాలేజికి అనుబంధంగా నడిచే విఆర్ ఐఏఎస్, ఐపిఎస్, బిఇడి కోర్సుల విభాగాల్లో విద్యార్థులకు అందవలసిన స్కాలర్‌షిప్పులు ఒక పథకం ప్రకారం స్వాహాచేసినట్లు తెలిసింది. స్కాలర్‌షిప్పులు డ్రా చేసుకోను విద్యార్థులకిచ్చే ఏటిఎం కార్డులను తమ ఆధీనంలో వుంచుకొన్న సిబ్బంది ఈ నీచానికి ఒడిగట్టినట్లు తెలిసింది. ఈ వ్యవహారమై విచారణ చేయిస్తే అన్ని విషయాలు బయట పడతాయి.

## టిబి ఆసుపత్రిని ఆక్రమించేశారు!

విశాలమైన టిబి ఆసుపత్రి ప్రాంగణం కుచించుక పోయింది. ఆసుపత్రి వెనుక వైపు స్థలంలో కార్పొరేషన్ కార్యాలయం కట్టిన అధికారులు ఆసుపత్రి ముందు నుంచి 40 అడుగుల నిడివిగల రోడ్డు పనులు మొదలెట్టారు. ఆసుపత్రిని ఆనుకొని ప్రక్కనే కట్టిన జడ్పీ నూతన కార్యాలయ భవన నిర్మాణ పనులు తుది దశలో వున్నాయి. ఇంకేదయినా ప్రభుత్వ కార్యాలయాన్ని ఇక్కడ నిర్మించే ఉద్దేశ్యంతో నెల్లూరు పాత ప్రముఖులు ఎంతో కష్టపడి కట్టిన క్షయాసుపత్రినే ఇక్కడి నుంచి మాయం చేసి పారేస్తారేమో ఇప్పటి మన పుర ప్రముఖులు.

## వైఎస్‌ను మర్చిపోయిన వివేకా!

నెల్లూరు నూతన కార్పొరేషన్ కార్యాలయం వద్ద ఈ వారంలో పెద్ద ఎత్తున వృద్ధాప్య ఫించన్ల పంపిణీ కార్యక్రమం చేపట్టారు. జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. విచిత్రమేమిటంటే వేదికపై ఏర్పాటుచేసిన ఫ్లెక్సీలో పించన్ల సృష్టికర్త స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చిత్రం కనిపించలేదు. దీనిలో స్వర్గీయ ఇందిరా గాంధీ, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి, మంత్రి రామనారాయణరెడ్డి, జంట ఎమ్మెల్యేల ఫోటోలుండడం చూసి ఈ కార్యక్రమానికి విచ్చేసిన వారంతా విస్మయం వ్యక్తం చేశారు.



## బోడిగాడి తోటలో రోడ్డు పనులు!

నెల్లూరు బోడిగాడి తోటలో రోడ్డు పనులకు 15వ తేది రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి శంకుస్థాపన చేశారు. 17 లక్షల రూపాయలు వ్యయ పరచి రోడ్ల నిర్మాణంతోపాటు వీధి దీపాలు, త్రాగునీటి సౌకర్యం కల్పిస్తానన్నారు.

## పిఆర్పీకి ప్రతాప్ రాజీనామా

కావలి ప్రజారాజ్యం పార్టీ నేత, మొన్నటి ఎన్నికలలో ఆ పార్టీ నుంచి కావలి నియోజకవర్గం అభ్యర్థిగా పోటీ చేసిన రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి రాజీనామా ప్రకటించారు. ఎన్నికల అనంతరమే పార్టీని వీడాలని అనుకొన్నప్పటికీ ఏడాదిపాటు ఓపిక పట్టిన ఆయన చివరకు ప్రజారాజ్యాంను వీడారు. చిరంజీవి తన పట్ల అభిమానం చూపించినా పార్టీ నిర్వహణ బాగోలేనందున రాజీనామా చేస్తున్నట్లు ఆయన ప్రకటించారు.

## జగన్‌ను వీడను!

ఎన్ని అవరోధాలు ఎదురైనా వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని వీడే ప్రసక్తేలేదని కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తేల్చి చెప్పారు. జగన్ వెంట వుండడం వల్ల వ్యక్తిగతంగా, ఎమ్మెల్యే పదవికి ఇబ్బందులు వచ్చినా ఆయన్ను వీడే ప్రసక్తే లేదన్నారు. ఇంత చెప్పిన పెద్ద మనిషి చివర్లో తెలుగుదేశం పార్టీ పగ్గాలు నందమూరి వంశానికి అప్పగించాలని చెప్పడం కొస మెరుపు.

## రైతులను విస్మరిస్తున్నారు

జిల్లాలో మంత్రి, పలువురు అధికార పార్టీ ఎమ్మెల్యేలు వున్నా ఎవరికీ రైతుల సమస్యలు పట్టడం లేదని టిడిపి జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి విమర్శించారు. ఎన్‌టిఆర్ వర్ధంతి సందర్భంగా నర్తకి సెంటర్‌లోని ఆయన విగ్రహానికి పూలమాల వేసి నివాళులు అర్పించిన అనంతరం సోమిరెడ్డి మాట్లాడుతూ ఆర్థిక మంత్రి పదవి కాపాడుకొనే యత్నంలో బిజీగా వుంటే, ఆయన సోదరుడు బిళ్లంకోడి, బొంగరాలాట, చింత పిక్కలాట ఆడుకొంటుంటాడు. మరో ఎమ్మెల్యే బెట్టింగ్‌లో బిజీగా వుంటాడని వ్యంగ్య వ్యాఖ్యానాలు చేశారు.

## హడలెత్తించిన లారీ క్లీనర్

ఫూటుగా మద్యం సేవించి ఆ మత్తులో లారీతోలి ప్రజలను హడలెత్తించారు లారీ క్లీనర్ అశోక్ తదితరులు. రాజుపాళెం నుంచి లారీ నడుపుకొని వస్తూ నవాబుపేట వద్ద మత్తులో ఎటు నడుపుతున్నారో తెలియక అడ్డం వచ్చిన వాహనాలను ఢీ కొట్టడమేకాక ఇంటి గోడను బ్రద్దలు కొట్టి లారీని ఇంట్లోకి పోనివ్వడంతో హడలి పోయారు స్థానికులు. కొందరికి గాయాలయ్యాయి. స్థానికులు వారిని పట్టుకొని దేహశుద్ధిచేసి పోలీసులకు అప్పగించారు.

## గుడిలో పులి చర్మం

ఎసి నగర్ వినాయకుని గుడిలో పదేళ్ల కాలంనాటి పులి చర్మం దొరకడం చర్చనీయాంశమయ్యింది. గుడి ముందు ఎవరో ఈ చర్మాన్ని వదలి వెళ్లడంతో గుర్తించిన ఆలయ పూజారి, స్థానికులు పోలీసులకు సమాచారం అందించడంతో వారు ఫారెస్టు వారిని పిలిపించారు. వారు పరిశీలించి ఇది పదేళ్లకాలం నాటి పులి చర్మం అని, సాధువులు వినియోగించేదిలా వుందని అభిప్రాయ పడ్డారు.

## ప్రసన్న సంగతేమైంది?

కోవూరు ఎమ్మెల్యే నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డిపై అనర్హత వేటు పడనుందా, ఏమైందది అంటూ మంత్రి శైలజానాథ్‌ను రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి అడిగి తెలుసుకొన్నారు. సంక్రాంతి పండుగను పురస్కరించుకొని నెల్లూరులోని అత్తారింట దిగిన మంత్రిని కలసిన వివేకా ప్రసన్న గురించి ఆరాతీయడం చర్చనీయాంశమయ్యింది. చివరకు బయటకు వచ్చి పార్టీకి వ్యతిరేకంగా వ్యవహరించే వారిపై చర్యలు చేపట్టాల్సిందేనని వ్యాఖ్యానించడంతో అక్కడున్న వారు అవాక్కయ్యారు.

## ఎన్‌టిఆర్ వర్ధంతి

మాజీ ముఖ్యమంత్రి స్వర్గీయ ఎన్‌టి రామారావు వర్ధంతిని తెలుగు దేశం నేతలు, ఆయన అభిమానులు జనవరి 18వ తేది ఘనంగా నిర్వహించారు. స్థానిక నర్తకి సెంటర్ వద్ద గల ఎన్‌టిఆర్ విగ్రహానికి పూలమాలలు వేసిన టిడిపి జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, రమేష్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తదితరులు ఆయన సేవలను కొనియాడారు.

## బోగోలులో చర్చి ప్రారంభోత్సవం!

బోగోలు వాసులు, బెంగుళూరులో స్థిరపడ్డ గ్రామంపై మక్కువతో చర్చి నిర్మాణాన్ని చేపట్టారు. హిమ్ సంస్థ డైరక్టర్ జాన్ ప్రభాకరన్, కోఆర్డినేట్ డైరెక్టర్ బి.శ్రీనివాసులు పది లక్షలు వెచ్చించి బోగోలులో నిర్మించిన చర్చిని 19వ తేది ప్రారంభించారు. ఈ సందర్భంగా వందలాది మందికి అన్నదానం చేయడమే గాక ఆర్థిక సహాయం చేసి తమలోని మంచి మనసు చాటారు.

## దేవళ్ల శేషారెడ్డి మరణం

నిత్య కృషీవలుడు, నవ్వడం నవ్వించడం తన జీవన శైలిగా మలచుకొన్న స్నేహశీలి, నెల్లూరు జిల్లా తొలితరం పారిశ్రామికవేత్త, యునైటెడ్ మొజాయిక్స్ అధినేత దేవళ్ల శేషారెడ్డి 19తేది మరణించారు. ఎంతటి గంభీరమైన విషయమైనా సరే, ఒక్క నవ్వుతో తేల్చి పారేసే వాడాయన. ఆయనతో మాట్లాడితే ఎవరికైనా మనసు తేలిక పడడం ఖాయం. జీవితాన్ని అంత సరదాగా, సంతోషంగా గడపగలగడం ఎంతో పుణ్యం చేసుకొంటే తప్ప సాధ్యం కాదు.

ఆయన స్వగ్రామం మోడేగుంట. నలభై యేళ్ల క్రితమే రైసు మిల్లులు, ఆయిల్ మిల్లులు, మొజాయిక్ ఫ్యాక్టరీ, గ్లాస్ పరిశ్రమ ప్రారంభించాడు. గ్లాస్ ఉత్పత్తులను జర్మనీ, కువైట్ వంటి దేశాలకు ఎగుమతి చేశాడు. కొంతకాలం కాంట్రాక్టర్‌గానూ వ్యవహరించాడు. ఆయన వయస్సు 80 సంవత్సరాలు. భార్య, ముగ్గురు కుమార్తెలు, ఇద్దరు కుమారులు వున్నారు.

## నాయుడు సుబ్బరామరెడ్డి మృతి

ముంగమూరు భూస్వామి, సజ్జనశీలి, పెద్దమనిషి, వివాదరహిత వ్యక్తిత్వం కల్గినవాడు – నాయుడు సుబ్బరామరెడ్డి 11తేది మరణించారు. ఆయన వయస్సు 80సంవత్సరాలు. ఆయన అల్లుడు డి.మహేష్‌రెడ్డి, సినిమా రంగంలో అగ్రశ్రేణి నిర్మాతగా వున్న కామాక్షి మూవీస్ అధినేత డి.శివప్రసాదరెడ్డికి సోదరుడు. సుబ్బరామరెడ్డి గారికి భార్య, కుమార్తె వున్నారు.

కొరవ 14వ పేజీలో

# మేకపాటి బ్రదర్స్‌కే జగన్ పార్టీ పెత్తనం!

**ఎవరైనా వారి నాయకత్వంలోనే పనిచేయక తప్పని పరిస్థితి.**





వైఎస్ జగన్మోహన్‌రెడ్డి పెట్టబోయే కొత్త రాజకీయ పార్టీకి సంబంధించి జిల్లాలో సకల సబ్బందు బాధ్యతలను మేకపాటి సోదరులకే అప్పగించినట్లు తెలిసింది. విచిత్రమేమిటంటే మేకపాటి రాజమోహన్‌రెడ్డి నెల్లూరు పార్లమెంటు స్థానం నుంచి కాంగ్రెస్ పార్టీ ఎమ్పీగా కొనసాగుతుండగా, ఆయన సోదరుడు ఉదయగిరి ఎమ్మెల్యేగా కాంగ్రెస్ పార్టీ తరపునే ప్రాతినిధ్యం వహిస్తున్నారు. కాంగ్రెస్ పార్టీలో వైఎస్ జగన్మోహన్‌రెడ్డి కొనసాగుతున్నప్పుడు జిల్లాలో జరిపిన ఓదార్పు యాత్రకు మేకపాటి సోదరులే ఏడు నియోజకవర్గాల్లో సారధ్య బాధ్యతలు మోశారు. నెల్లూరు, నెల్లూరు రూరల్, సర్వేపల్లి నియోజకవర్గాల్లో ఈ బాధ్యతలను రాజీవ్‌భవన్ నిర్వాహకులు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, అనిల్ కుమార్ యాదవ్ చూశారు. కాంగ్రెస్ పార్టీకి జగన్ రాజీనామా చేశాక ఇడుపులపాయలో నిర్వహించిన సభ, విశాఖ ఓదార్పు యాత్ర, ఢిల్లీలో చేపట్టిన నిరసన దీక్షలోనూ మేకపాటి బ్రదర్స్ ప్రముఖంగా పాల్గొన్నారు. రాజమోహన్‌రెడ్డి అన్ని కార్యక్రమాల్లో పాల్గొన్నా ఎక్కడా నోరు జారకపోయినా చంద్రశేఖర్‌రెడ్డి మాత్రం దమ్ముంటే తమపై చర్య తీసుకొనమనే వరకు వెళ్లారు. ఇటీవల ఎవరు జగన్ పార్టీకి మద్దతు ప్రకటించాలనుకొన్నా దర్గామిట్టలోని మేకపాటి సోదరుల కార్యాలయానికి వెళ్తున్నారు. కోవూరు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి మేకపాటి బ్రదర్స్‌ను వెన్నంటి వున్నారు. కావలి ప్రజారాజ్యం పార్టీ నేత రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డిని మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి జగన్ వద్దకు తీసుకెళ్లి పార్టీలో చేర్పించారు. జిల్లాలో మంచి నాయకునిగా, రాజకీయవేత్తగా జనంలో ఇమేజ్ సంపాదించుకొన్న జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి సైతం మేకపాటి సోదరుల సమక్షంలోనే జగన్ పార్టీకి మద్దతు ప్రకటించనున్నారు. జిల్లాలో ఏ పార్టీల నాయకులు, జగన్ పార్టీలో చేరినా వారంతా మేకపాటి సోదరుల పెత్తనం క్రింద పనిచేయక తప్పని పరిస్థితి. ఇది కొందరు నాయకులకు సహ్యం కాకపోయినా జగన్‌కు మేకపాటి సోదరులకు మధ్య చిగురించిన స్నేహబంధం ముందు మిగతా విషయాలేవీ పట్టించుకోవడం లేదని తెలిసింది. తమకు రాజకీయంగా అందివచ్చిన అవకాశాన్ని ఏవిధంగా మేకపాటి బ్రదర్స్ వినియోగించుకొంటారన్న దానికి కొన్నాళ్లు వేచి చూడక తప్పదు.

## ఎసి మార్కెట్ కన్నా
# రిలయన్స్ సూపర్ మార్కెట్ బెటర్!

గత రెండు మాసాలుగా పెరిగిన కూరగాయల ధరలతో సామాన్య మధ్యతరగతి ప్రజలు పడుతున్న పాట్లు వర్ణనాతీతంగా వున్నాయి. నెల్లూరు జనం కూరగాయలు కొనేందుకు ఎసి కూరగాయల మార్కెట్ మీద ఆధారపడతారు. కానీ ఈ మార్కెట్‌లో అన్నింటా మోసాలే. నాణ్యమైన కూరగాయలు వుండవు. రేట్లు ఎక్కువ. తూకం సరిగా వుండదు. కూరగాయలను ఏరుకొనే వసతి లేదు. డిఎస్‌ఓ జ్వాలాప్రకాష్ పైనే మార్కెట్ వ్యాపారస్తులనే రౌడీలు తిరగబడ్డారు. ఇక సామాన్య జనమెంత? ఈ పరిస్థితులలో ఎసి మార్కెట్ కన్నా కెవిఆర్ పెట్రోల్ బంకు ప్రక్కనున్న రిలయన్స్ సూపర్ మార్కెట్‌లో కూరగాయలు కొనడం ఉత్తమంలాగుంది. ఎసి మార్కెట్‌తో పోల్చుకుంటే రిలయన్స్‌లో మంచి సరకుంటుంది. తూకంలో మోసాలుండవు. మనకు కావాల్సిన పరిణామంలో కూరగాయలను తీసుకోవచ్చు. నెల్లూరు మార్కెట్‌లో దొరకని వెరైటీ కూరగాయలు సైతం రిలయన్స్ సూపర్‌లో దొరుకుతున్నాయి. ఈ వారంలో ఎసి మార్కెట్‌లో కేజి ఎర్రగడ్డలు 55, వంకాయలు 30, బెండకాయలు 30, క్యాబేజి 30, పచ్చిమిర్చి 30, టమోటా 40, బీన్స్ 40, ఉర్లగడ్డ 15 రూపాయలు ధర పలికాయి. అదే రిలయన్స్‌లో కేజి ఎర్రగడ్డలు 50, వంకాయలు 20, బెండకాయలు 22, పచ్చిమిర్చి 22, నాటు టమోటా 33, బీన్స్ 26, ఉర్లగడ్డ 19 రూపాయలు ధర పలికాయి. కొత్తిమీర, పొదినా కట్టలు రిలయన్స్‌లో 6 రూపాయలకే దొరుకుతున్నాయి. బెంగుళూరు వంకాయలైతే కిలో 15 రూపాయలే. కాలీఫ్లవర్ 15 రూపాయలు, బీరకాయలు 22 రూపాయలుగా అమ్ముతున్నారు. ఎసి మార్కెట్ వ్యాపారులు దౌర్జన్యాన్ని, తూకంలో తప్పుడుతనాన్ని మానకుంటే నెల్లూరు జనాలు రిలయన్స్ సూపర్ వైపు అడుగులు వేస్తారని చెప్పక తప్పదు.




నెల్లూరులోని రిలయన్స్ సూపర్‌మార్కెట్‌లో రేటు తక్కువకే నాణ్యమైన కూరగాయలు.

• స్పెక్ట్రమ్

## అక్రమాలను కప్పిపెట్టే యత్నం



కోట్లాది రూపాయలు అవినీతి జరిగిన 2జి స్పెక్ట్రమ్ కుంభకోణంలో బాధ్యులను ప్రభుత్వం వెనకేసుకు రావడం సిగ్గుచేటని బిజెపి సీనియర్ నేత ఎం.వెంకయ్యనాయుడు వ్యాఖ్యానించారు. నెల్లూరులో తన స్వగృహంలో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ దేశంలో ఎన్నో కుంభకోణాలు వెలుగుచూస్తున్నా బాధ్యులపై చర్యలు తీసుకోవడంలో కేంద్ర ప్రభుత్వం పట్టీపట్టనట్లు వ్యవహరిస్తోందని విమర్శించారు. వేల కోట్ల రూపాయల అవినీతి జరిగిందని 2జి స్పెక్ట్రమ్ కేటాయింపులపై జాయింట్ పార్లమెంటరీ కమిటీ వేయాల్సిందేనని, దానికి కేంద్ర ప్రభుత్వం అంగీకరించే వరకు తమ పోరాటాన్ని ఉధృతం చేస్తామన్నారు. దీనిపై బడ్జెట్ సమావేశాల్ని స్తంభింపజేస్తామని హెచ్చరించారు. బాధ్యతాయుతమైన కేంద్ర మంత్రి కపిల్ సిబాల్ అసలు అందులో అక్రమాలే జరగలేదనడం దారుణమన్నారు. తక్షణం అతన్ని మంత్రివర్గం నుంచి తొలగించాలని డిమాండ్ చేశారు. కేంద్ర ప్రభుత్వ తీరు చూస్తుంటే బోఫోర్సు కేసులా స్పెక్ట్రమ్ కేసును నీరుగార్చే ప్రయత్నం చేస్తోందన్న అనుమానం వ్యక్తం చేశారు. ఇక రైతుల బాగోగులు పట్టించుకోవడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విఫలమయ్యాయన్నారు.

# నిబంధనలకు పాతర

**శ్రీచైతన్య టెక్నో స్కూల్ ఏర్పాటులో పలు అక్రమాలు**

క్రొత్తగా స్కూలు ఏర్పాటు చేయడంలో నిబంధనలు అతిక్రమించి ఇష్టానుసారంగా విద్యాశాఖ వ్యవహరించిన తీరుపై విచారణ జరుపుతున్న ఎసిబి అధికారులకు తీగలాగితే డొంక కదులుతున్న చందంగా ఎన్నో అక్రమాలు బయటపడుతున్నాయి. రామలింగాపురం ప్రాంతంలో శ్రీచైతన్య విద్యాసంస్థ టెక్నో స్కూలు ఏర్పాటు చేసింది. ప్రక్కనే గల మరో విద్యాసంస్థ దీనిని వ్యతిరేకిస్తూ విద్యాశాఖ అధికారులకు ఫిర్యాదు చేసింది. నిబంధనల ప్రకారం ఒక స్కూలు వుంటే దాని సమీపంలో మరో స్కూలుకు అనుమతివ్వరాదు. నిబంధనలు అతిక్రమించి టెక్నోస్కూలు నుంచి పెద్ద మొత్తంలో ముడుపులు అందుకొని విద్యాశాఖ ఉన్నతాధికారులు స్కూలు ఏర్పాటుకు అనుమతినివ్వడంపై గగ్గోలు రేగింది. దీనిపై కోర్టులో కేసు వేశారు. ఈ నేపథ్యంలో ప్రభుత్వం ఈ కేసు విచారణకు ఎసిబికి ఆదేశాలు జారీ చేయడంతో రంగంలోకి దిగిన ఆ శాఖ అధికారులకు దిమ్మతిరిగే అక్రమాలు వెలుగు చూశాయి. ఆ టెక్నో స్కూలు ఏర్పాటుకు యాజమాన్యం ఆది నుంచి అన్ని అడ్డదారులే తొక్కిన విషయం వెల్లడైంది. పాఠశాల ఏర్పాటుకు గుడ్డిగా విద్యాశాఖ అనుమతినివ్వడం, అడ్రసు తప్పుగా చూపడం, రిజిస్ట్రేషన్ చేయించడంలో పలు అవకతవకలు ఎసిబి అధికారుల విచారణలో బయటపడ్డాయి. దీనిపై సమగ్ర విచారణకు డిఎస్పీ శరత్ బాబు ఆధ్వర్యంలో అధికారులు విద్యాశాఖ కార్యాలయానికి వెళ్లగా సంబంధిత ఫైళ్లను అప్పగించేందుకు అధికారులు, సిబ్బంది దాగుడుమూతలాడడంతో చివరకు ఎసిబి అధికారులే తమకు కావాల్సిన ఫైళ్లను తీసుకొనిపోవాల్సి వచ్చింది. విద్యాశాఖలో స్కూలు పర్మిషన్లలో జరుగుతున్న పలు అక్రమాలు మెల్లమెల్లగా బట్టబయలు అవుతుండడంతో అధికారుల గుండెల్లో రైళ్లు పరిగెడుతున్నాయి.




నిబంధనలకు విరుద్ధంగా రామలింగాపురంలోని శ్రీచైతన్య టెక్నో స్కూల్.

• స్థానికులకు

# ఉద్యోగాలివ్వండి



ఆందోళన పథంలో రాధయ్య.

జిల్లాలో వివిధ ప్రాంతాల్లో పరిశ్రమలు ఏర్పాటుచేసిన కంపెనీల ప్రతినిధులకు ఎమ్మెల్సీ బూదాటి రాధయ్య హెచ్చరికలు జారీ చేశారు. పరిశ్రమల ఏర్పాటు కోసం రైతుల నుంచి భూములు పొందిన సంస్థలు సమీప గ్రామాల ప్రజలకు ఉద్యోగ, ఉపాధి అవకాశాలు కల్పిస్తామని ఇచ్చిన హామీలను నెరవేర్చడంలో పూర్తిగా విఫలం చెందాయన్నారు. ప్రెస్‌క్లబ్‌లో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో రాధయ్య మాట్లాడారు. భూములు కోల్పోయిన కుటుంబాలు జీవనోపాధి కోసం వలసలు వెళ్లే పరిస్థితి ఏర్పడిందన్నారు. స్థానికులకు పరిశ్రమల్లో ఉపాధి అవకాశాలు కల్పించకుండా బయట రాష్ట్రాలు, ఇతర జిల్లాల వారిని తీసుకుంటున్నారని ఆయన ఆరోపించారు. ఇన్ని సంవత్సరాలు ఉపాధి అవకాశాలు కల్పిస్తారని ఎదురుచూశామని, ఇక నుంచి జిల్లాలో ఏర్పాటుచేసే అన్ని పరిశ్రమలను తనిఖీ చేసి స్థానికులకే అవకాశాలు కల్పించే విధంగా ఆందోళన చేస్తామని రాధయ్య చెప్పారు. జిల్లా అధికార యంత్రాంగం కూడా జిల్లాకు చెందిన నిరుద్యోగుల గురించి పట్టించుకోవడం లేదన్నారు. జిల్లాకు చెందిన వారిని కాదని ఇతర జిల్లాలు, రాష్ట్రాలకు చెందిన వారిని పరిశ్రమల్లోకి తీసుకుంటే ప్రతిఘటిస్తామని హెచ్చరించారు. పరిశ్రమలకు ఎటువంటి సాంకేతిక సిబ్బంది అవసరమో తెలిపితే అందుకు అవసరమైన శిక్షణ అందిస్తామన్నారు.

# కాంగ్రెస్ కొంప ఖాళీ చేసి జగన్ గూటికి చేరిన జిప ఛైర్మన్!



జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి కాంగ్రెస్‌ను వీడి జగన్ పార్టీలో చేరిపోయాడు. రెండు నెలల నుంచి వూగిసలాటలో వున్న ఆయన, చివర కొచ్చేసరికి జగన్ అభిమానుల ఒత్తిడికి లొంగిపోయాడు. 20తేది సాయంత్రం తన ఇంట్లోనే భారీస్థాయి అభిమానుల సభ జరిపి, నాలుగు గంటలపాటు అందరి అభిప్రాయాలు విని, ఉద్వేగానికి లోనై, కాంగ్రెస్‌ను వీడాలనే నిర్ణయానికి వచ్చాడు.

జిల్లా రాజకీయాలలో ఒక నూతన తరానికి ప్రతినిధి కాకాణి గోవర్ధన్‌రెడ్డి. రాజకీయం అంటే రాబడికి సులభ మార్గం అనే నానుడి ప్రబలిపోతున్న సమయంలో, నీతి నిజాయితీలకు కట్టుబడి, ప్రజలకు చేరువ కావడానికి రాజకీయం ఒక అవకాశమన్న సంకల్పంతో వ్యవహరించిన సులక్షణవంతుడాయన. జిప ఛైర్మన్‌గా ఈ నాలుగున్నరేళ్లలో ఆయన సంపాదించుకొన్న మంచి పేరు, పెంచుకొన్న ప్రతిష్ట అపురూపమైనవి. ఎన్నో ఏళ్ల నుంచి రాజకీయాలలో డక్కా మొక్కీలు తిన్న వారికి సాధ్యం కాని భాగ్యం అది. గోవర్ధన్‌రెడ్డి ఎవరో తెలియనివారు, ఆయన ముఖం కూడా చూడనివారు కూడా ఆయన పేరు చెప్పగానే సద్భావంతో మాట్లాడుతారు. ఒక రాజకీయవాదికి అంతకంటే మించిన అదృష్టం వేరేమి వుంటుంది చెప్పండి?

జిప పాలనలో అనుకొన్నదానికంటే అధికంగా సఫలం కావడం గోవర్ధన్‌రెడ్డి రాజకీయ ప్రాభవానికి ఒక కారణం. సాధారణంగా జిప ఛైర్మన్లు, జిల్లా మంత్రుల ఆజ్ఞలకు బద్ధులుగా మెలగక తప్పదు. మంత్రిమాట కాదంటే, అధికారులను పైకి ఎగతోలి, ఒక్క కాగితం కదలకుండా బిగ పడతారు. కానీ గోవర్ధన్‌రెడ్డి మొదట నుంచి ఎంతో చాకచక్యంతో జిప పాలనను మంత్రులు, ఎమ్మెల్యేల పెత్తనం నుంచి తప్పించాడు. జిల్లా మంత్రి ఆనం రామనారాయణ రెడ్డితో తీవ్రస్థాయి విభేదాలు వచ్చిన తర్వాత కూడా తన స్వతంత్ర ప్రతిపత్తి కాపాడుకొన్నాడు. ఒక్క పైసా ఆశించకుండా పాలన సాగించడమే కాక, తన జేబులో సొమ్ము ఖర్చు పెట్టి పాఠశాలలు బాగు చేయించడం, స్కాలర్ షిప్పులు ఇవ్వడం, పేద పిల్లల చదువులకు సహాయం చేయడం, ప్రతిభావంతులకు అవార్డులు ప్రదానం చేయడం, ఆటల పోటీలు నిర్వహించడం వంటి కార్యక్రమాల ద్వారా అధికారులలో కూడా గురుత్వం సంపాదించుకొన్నాడు. దానితో, గోవర్ధన్‌రెడ్డి తోక కత్తిరించాలనే అక్కసుతో రామనారాయణ రెడ్డి ఎన్ని కుప్పిగంతులు వేసినా ప్రయోజనం లేకుండా పోయింది.

పెన్నా ఇసుక దోపిడీని నివారించడంలో గోవర్ధన్‌రెడ్డి చూపిన పట్టుదల, పోరాటపటిమ ఆయన ప్రతిష్టను ఎంతగానో పెంచాయి. ఆనం వివేకానందరెడ్డి, ఆయన సోదరులు కలిసి ఇసుక మాఫియాగా మారి చేసిన దురాగతాలను సమర్ధవంతంగా నివారించాడు గోవర్ధన్ రెడ్డి. అందుకోసం రెండేళ్లుగా హైకోర్టులో తన స్వంత ఖర్చుతో న్యాయపోరాటం చేశాడు. ఇసుక వ్యాపారులు చెల్లించే రాయల్టీ జిప, పంచాయితీ తదితర స్థానిక సంస్థలకు చెందుతుంది. గత కొన్నేళ్లుగా వివేకానందరెడ్డి ఇసుక మాఫియా నేతగా అవతారమెత్తి, రాయల్టీ కట్టకుండా, వేలం పాటలు జరగకుండా అక్రమ తరలింపుకు అండగా నిలుస్తున్నాడు. దానితో స్థానిక సంస్థలకు చిల్లిగవ్వ రాబడి లేకుండానే కోట్లాది రూపాయల ఇసుక పెన్నా నుంచి తరలి పోతున్నది. దీన్ని నివారించడంలో సఫలుడైనాడు జిప ఛైర్మన్. ఆయన దెబ్బకు, ఇసుక వ్యాపారులంతా సక్రమంగా రాయల్టీ చెల్లించడం వల్ల ఒక్క జిప ఖాతాలోకే గత రెండేళ్లలో 55 కోట్ల రూపాయలు జమ అయ్యాయి. ఆయా పంచాయితీలకు కూడా చెప్పుకోదగిన నిధులు వచ్చాయి. అటు జిల్లామంత్రి, ఇటు ఇసుక వ్యాపారులు తనపై తెచ్చిన ఒత్తిడిని తట్టుకొని, చేసిన ఇసుక పోరాటంతో గోవర్ధన్‌రెడ్డి పేరు జిల్లాలో మార్మోగింది.

అయితే, ఆనం సోదరులతో తనకున్న రాజకీయ విభేదాల దృష్ట్యా కాంగ్రెస్ పార్టీలో ఎక్కువ కాలం కొనసాగడం తన భవిష్యత్తుకు మంచిది కాదనే అంచనాకు వచ్చిన జిప ఛైర్మన్ కొన్ని నెలలపాటు అనుచరులతో మంతనాలు జరిపి, జగన్ పార్టీలో చేరాలనే నిర్ణయం తీసుకొన్నాడు. ఆయన్ను ఆ నిర్ణయం నుంచి తప్పించడానికి నేదురుమల్లి జనార్దనరెడ్డి, ఆదాల ప్రభాకర్‌రెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి చేయని ప్రయత్నం లేదు. ముఖ్యమంత్రి స్థాయి లోనే కాదు, ఏకంగా సోనియాగాంధీ పేరుతో కూడా బ్రేక్ వేయడానికి ప్రయత్నం చేశారు. కానీ ఒకసారి నిర్ణయం తీసుకొన్న తర్వాత వెనుకడుగు లేదనే ఉద్దేశంతో ఆ ఒత్తిడులు తిరస్కరించాడు.

గోవర్ధన్‌రెడ్డితో కలిసి, జగన్ పార్టీలో చేరడానికి దాదాపు సగం జడ్పీటిసి సభ్యులు సిద్ధపడ్డారు. ఒక దశలో 22 మంది జడ్పీటిసిలు ఆయనకు మద్దతు తెలిపారు. అయితే జనార్ధనరెడ్డి, ప్రభాకర్‌రెడ్డి, రామనారాయణ రెడ్డిల త్రయం ఆ వలసను అడ్డుకోవడానికి తమ శక్తినంతా ధార పోయడంతో,

కొరవ 14వ పేజీలో



పల్స్ పోలియో కార్యక్రమంపై నెల్లూరు గోల్డన్ జూబ్లీ హాల్‌లో వైద్యాధికారులతో నిర్వహించిన సమీక్షా సమావేశంలో మాట్లాడుతున్న అదనపు జాయింట్ కలెక్టర్ టి.సీతారామయ్య.


చెన్నైలోని అమరజీవి పొట్టిశ్రీరాములు సొసైటీ స్వర్ణోత్సవాల సందర్భంగా నృత్య ప్రదర్శన చేసిన నెల్లూరు నర్తకి నదియాను సన్మానిస్తున్న ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, డాక్టర్ సిఎంకె.రెడ్డి, మాలతీ చందూర్.


నెల్లూరు సుబేదారుపేటలోని సెయింట్ జాన్ స్కూల్ పూర్వ విద్యార్థుల సంఘం నేతృత్వంలో జరిగిన షటిల్ పోటీల్లో విజేతలు శేషగిరి, సుధీర్, గౌతమ్, సునీల్‌లకు బహుమతులు అందిస్తున్న లయన్ జె.చంద్రశేఖర్, చెవుల గంగాధర్.


నెల్లూరు వేదాయపాళెంలోని లిల్లీ లిటిల్ ఫ్లవర్ స్కూల్‌లో జరిగిన పూర్వ విద్యార్థుల సమావేశంలో కరస్పాండెంట్ ఇసి.నారాయణరెడ్డిని సన్మానిస్తున్న దృశ్యం.

# వికలాంగులకు ఉపాధి హామీ!

**● వెంకటగిరి ఎమ్పీడిఓ భరోసా**

వికలాంగులు గ్రూపుగా, శ్రమశక్తి సంఘాలుగా ఏర్పడితే వారికి ఉపాధి పనుల్లో అవకాశం కల్పిస్తామని వెంకటగిరి ఎంపిడిఓ బాలాజీ తెలిపారు. మండల పరిషత్ కార్యాలయంలో జరిగిన కార్యక్రమంలో ఆయన వికలాంగులను ఉద్దేశించి మాట్లాడారు. వికలాంగులు 70శాతం పని చేసినా ఇతర కూలీలలాగే మొత్తం కూలీ చెల్లిస్తామన్నారు. జాబ్ కార్డుల్లో పేరు నమోదు చేసుకొన్న వికలాంగులకు 150 రోజుల పని దినాలు కల్పిస్తామని హామీ ఇచ్చారు. 18 నుంచి 60 సంవత్సరాల వయసు కల్గిన వారందరూ జాబ్‌కార్డుల్లో పేరు నమోదు చేసుకొనేందుకు అర్హులన్నారు. అధికారులు ఉపాధిహామీ పథకంపై హామీలు గుప్పిస్తుంటే ఆచరణలో మాత్రం విరుద్ధంగా వుంటుంది. రూరల్ ప్రాంతంలోని సిద్ధవరం గ్రామంలో ప్రధాన రహదారి బురదమయంగా మారింది. చివరకు బస్సులు కూడా తిరగలేని పరిస్థితి ఏర్పడింది. పిల్లలు పాఠశాలలకు వెళ్లలేక, రోడ్లపై నడవాలంటేనే కూరుకపోతుండడంతో గ్రామస్తులు వినూత్న నిరసన తెలిపారు. బురదగా మారిన రోడ్లో వరినాట్లు వేసి నిరసన చేపట్టినా అధికారుల్లో చలనం లేదు. ఇప్పటికైనా బురద తొలగించి రహదారిని బాగు చేయాలని గ్రామస్తులు కోరుకొంటున్నారు.

# బస్సు కోసం నానా యాతలు!

**పాపం... పల్లెపాడు దిన్నె వాసులు**

ముత్తుకూరు మండలం పల్లెపాడుదిన్నె గ్రామానికి బస్సు సౌకర్యం లేకపోవడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. రహదారులను లక్షల రూపాయలు ఖర్చు చేసి నిర్మించినా రవాణా సౌకర్యానికి నోచుకోకపోవడం ఈ ప్రాంత ప్రజలకు ఇబ్బందిగా పరిణమించింది. లింగాయపాళెం నుంచి ముసునూరువారి పాళెం వరకు కోటి రూపాయలతో తారురోడ్డును నిర్మించారు. గత కొన్నేళ్ల నుంచి ఈ ప్రాంతానికి బస్సు సౌకర్యం లేదు. లింగాయపాళెం, పల్లెపాడు, దిన్నె, దుత్తపాడు, కొత్తపాళెం, సోయమ్మపాళెం, సీతారెడ్డితోపు గ్రామాలకు ప్రజలు ప్రయాణం చేస్తుంటారు. ఈ పరిస్థితుల్లో ఆర్టీసి బస్సు రాకపోవడంతో ఆటోలపై ఆధారపడాల్సి వస్తోంది. ప్రజల సౌకర్యాన్ని దృష్టిలో వుంచుకొని బస్సు సౌకర్యాన్ని కల్పించాలని ఈ ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.

**● రామన్న చెరువు**

# కలుజు లీకేజి!

ఉలవపాళ్ల కలుజు లీకేజితో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది. ఈ చెరువు కలుజు నుంచి నీటి ప్రవాహం రహదారిపైకి రావడంతో కావలి నుంచి వచ్చే వాహనాలు, అల్లూరు నుంచి వచ్చే వాహనాల రాకపోకలకు అంతరాయం కల్గుతోంది. ఈ లీకేజీల కారణంగా రోడ్లపై నీరు ప్రవహిస్తూ పాచి పట్టడంతో వాహనాలు అదుపుతప్పి తరచూ ప్రమాదాలకు కారణమవుతోంది. ఈ ప్రాంతంపై ప్రయాణించాలంటేనే

**రాకపోకలకు ఇక్కట్లు**

వాహన చోదకులు, ప్రయాణీకులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తిరగాల్సి వస్తోంది. అటు ప్రజాప్రతినిధులు, అధికారులు ఈ మార్గం గుండానే నిత్యం ప్రయాణిస్తున్నా వారికి ఈ సమస్య పట్టకపోవడం పట్ల ప్రజలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఇప్పటికైనా అధికారులు స్పందించి కలుజు లీకేజిని అరికట్టి ప్రమాదాలు జరగకుండా చూడాలని గ్రామస్తులు కోరుకొంటున్నారు.

# వాయుపుత్రుని భూముల కబ్జా

**ఉలవపాళ్లలో తెగింపు**

దగదర్తి మండలం ఉలవపాళ్ల పరిధిలో గల ఆంజనేయస్వామి ఆలయానికి సంబంధించిన భూమిని కబ్జా చేసే ప్రయత్నాలు జోరందుకున్నాయి. రాజుల కాలం నాడు నిర్మించిన ఈ గుడికి వున్న ఆస్తులన్నీ కాలక్రమేణా హరించుకపోగా ప్రస్తుతం 10 ఎకరాల భూమి మిగిలింది. హైవేకు ప్రక్కనే గల ఈ భూమి విలువ లక్షల్లో వుండడంతో కబ్జాదారుల కన్ను దీనిపై పడింది. రెవెన్యూ సిబ్బందితో లాలూచిపెట్టుకొని రికార్డులు తారుమారు చేసి దేవుడి ఆస్తిని కాజేసేందుకు ప్రయత్నిస్తున్నట్లు సమాచారం. ఈ వ్యవహారంపై దేవాదాయ అధికారులకు తెలిపినా వారు పట్టించుకోవడం లేదని గ్రామస్తులు చెప్తున్నారు. లక్షల విలువ చేసే దేవుని భూమి అన్యాక్రాంతం కాకముందే అధికారులు నిద్రమేల్కొని భూమిని కాపాడాలని వారు కోరుకొంటున్నారు.

# కలెక్టర్ ఆదేశాలు బేఖాతర్!

**వంతెనల నిర్మాణాలు చేపట్టమన్నా పట్టించుకోలేదు.**

సాక్షాత్తు జిల్లా కలెక్టర్ దెబ్బతిన్న వంతెనలను పరిశీలించి నిర్మాణానికి ప్రతిపాదనలను పంపాలని అధికారులను ఆదేశించినా పట్టించుకోని పరిస్థితి దగదర్తి మండలంలో చోటు చేసుకొంది. దగదర్తి ప్రధాన రహదారిపై గల పైడేరు వాగు, చవటపుత్తేడు, పిల్లి వాగు వంతెనలు పూర్తిగా ధ్వంసం అయిపోయాయి. ఈ కారణంగా గ్రామాలకు బస్సులు కూడా నడవని పరిస్థితి. రవాణా సౌకర్యం లేకపోవడంతో ఈ గ్రామం నుంచి రాజుపాళెం మీదుగా దగదర్తికి చేరుకోవాల్సి వస్తుంది. దెబ్బతిన్న వంతెనలను జిల్లా కలెక్టర్ రాంగోపాల్ పరిశీలించి వంతెనల నిర్మాణానికి ప్రతిపాదనలు పంపాలని సంబంధిత శాఖాధికారులకు ఆదేశాలు జారీ చేసినా స్పందన లేదు. ఇప్పటికైనా జిల్లా అధికారులు తగిన శ్రద్ధ వహించి వంతెనల నిర్మాణం చేపట్టాలని స్థానికులు కోరుకొంటున్నారు.



వ్యాయామోపాధ్యాయులతో జిల్లా పరిషత్ కార్యాలయంలోని తన ఛాంబర్‌లో సమీక్షా సమావేశం నిర్వహిస్తున్న ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి. ప్రక్కన డిఇఒ బాలకాశయ్య వున్నారు.

# రెవిన్యూ పనితీరు ఘోరం

ఇష్టానుసారంగా ప్రవర్తిస్తూ అన్ని విధాలా విమర్శల పాలవుతున్న వెంకటగిరి రెవెన్యూ సిబ్బంది పట్ల జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ అసహనం వ్యక్తం చేశారు. ఇటీవల వెంకటగిరికి వచ్చిన ఆయన రెవెన్యూ అధికారుల పనితీరును సమీక్షించారు. వివిధ అంశాలపై జెసి అడిగిన ప్రశ్నలకు సిబ్బంది వద్ద సమాధానం లేకపోవడంతో ఆగ్రహించారు. అంతా మీ ఇష్టం అయిపోయింది. వీఆర్‌ఓలే అడంగళ్ ఇచ్చేయడం ఏందంటూ మండి

## వెంకటగిరిలో చిర్రుబుర్రులాడిన జెసి

పడ్డారు. రికార్డులు తనిఖీ చేయగా అంతా తప్పుల తడకగా వుండడం పట్ల తహశీల్దార్ సుశీలమ్మను నిలదీశారు. ఈ సందర్భంగా రేషన్ కార్డుల కోసం గత ఆరు నెలలుగా తిరుగుతున్న అర్జీదారుల నుంచి వివరాలడిగి తెలుసుకొన్న జాయింట్ కలెక్టర్ దీనిపై రెవెన్యూ అధికారులను ప్రశ్నించడంతో సమాధానం చెప్పలేక పోయారు. మొత్తం మీద జెసి వెంకటగిరి పర్యటన రెవెన్యూ అధికారుల గుండెల్లో రైళ్లు పరిగెత్తించింది.

# దగదర్తిపై పడ్డ దొంగలు

## చలనం లేని పోలీసు

దగదర్తిలో దొంగతనాలు జోరందుకొన్నాయి. చలి కాలం కావడం, మంచు పడుతుండడంతో గ్రామాల్లో ప్రజలు ఇళ్లలో నుంచి బయటకు రాక, వెచ్చగా కునుకు తీస్తుండడంతో దొంగలు తమ పని చక్కబెట్టుకొంటున్నారు. ఇప్పటివరకు 10 ఇళ్లలో దొంగతనాలు జరగడంతో జనం హడలిపోతున్నారు. దీనికి తోడు ఒక వ్యక్తిని హత్య చేశారు. శాంతిభద్రతలు క్షీణిస్తున్నా ప్రజల ఆస్తులు, ప్రాణాలకు రక్షణ లేకపోయినా పోలీసులు ఎలాంటి చర్యలు చేపట్టక పోవడం విమర్శల పాలవుతోంది. ఇప్పటికైనా వరుస దొంగతనాలను అరికట్టే దిశగా పోలీసులు నిద్రమేల్కొని డ్యూటీ చేస్తే తప్ప ప్రజల్లో పోలీసుల పట్ల నమ్మకం ఏర్పడే పరిస్థితులు లేవు.

● సింగపేట

# దోబీఘాట్ ఆక్రమణ!

అల్లూరు మండలం సింగపేట గ్రామంలో రజకుల దోబీఘాట్ ఆక్రమణలకు గురౌతోంది. భూములకు విలువ పెరగడంతో స్థానిక బడాబాబుల కన్ను ఈ స్థలంపై పడింది. మెల్లగా ఈ స్థలాన్ని ఆక్రమించేస్తున్నారు. కులవృత్తి చేసుకొని జీవించే రజకుల కుటుంబాలకు 40 ఏళ్ల క్రిందట శివారు ప్రాంతంలోగల కోనేటిగుంట వద్ద 7.10 ఎకరాల స్థలాన్ని కేటాయించారు. అప్పటి నుంచి రజకులు దోబీ ఘాట్‌గా దీనిని ఉపయో

## పట్టించుకోని అధికారులు

గిస్తున్నారు. ఈ పరిస్థితులలో భూముల ధరలకు రెక్కలు రావడంతో కబ్జాదారుల కన్ను ఈ స్థలంపై పడింది. కొందరు రైతులు ఈ గుంటను ఆక్రమించుకొంటున్నారు. దీనిపై రజకులు సంబంధిత అధికారులకు ఫిర్యాదు చేసినా ప్రయోజనం లేకుండా పోయిందని స్థానికులు వాపోతున్నారు. మరోవైపు రెవెన్యూ అధికారులు మాత్రం ఈ కబ్జా వ్యవహారం ఇంతవరకు తమ దృష్టికి రాలేదని చెప్పడం విశేషం.

● వైద్యాధికారిణిని

# గత్తరపెట్టిన అయ్యోర్లు!

## క్రమశిక్షణలేని గురువులు

పదిమందికి ఆదర్శంగా నిలవాల్సిన ఉపాధ్యాయులు తమకు అదనపు విధులు కేటాయించలేదన్న కోపంతో వైద్యాధికారిణితో దూషణకు దిగిన వైనం బోగోలు మండలం కోవూరుపల్లిలో చోటు చేసుకొంది. స్థానిక విద్యావనరుల కేంద్రంలో ఉపాధ్యాయులు, ఆరోగ్యసిబ్బందికి శిక్షణా కార్యక్రమం జరిగింది. మండల విద్యాధికారి సాయిసింగ్ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి మండల వైద్యాధికారిణి డాక్టర్ సౌజన్య విచ్చేశారు. డాక్టర్ మాట్లాడుతుండగా కొందరు ఉపాధ్యాయులు మూకుమ్మడిగా లేచి ఆమెతో గొడవకు దిగారు. గత ఏడాది నిర్వహించిన పల్స్‌పోలియో కార్యక్రమంలో తమకు ఎందుకు డ్యూటీలు వేయలేదంటూ పెద్ద పెద్దగా అరుస్తూ వాదనకు దిగి చుట్టుముట్టారు. ఈ హఠాత్తు పరిణామానికి నిశ్చేష్టురాలైన డాక్టర్ సౌజన్య ఉపాధ్యాయులనుద్దేశించి మాట్లాడుతూ వైద్య సిబ్బంది తగినంత మంది లేనపుడు మీ సేవలు వినియోగించుకొంటున్నాం. అప్పుడు ఆ అవసరం లేకపోవడంతో జిల్లా అధికారుల సూచనమేరకే టీచర్లకు విధులు కేటాయించలేదని చెప్పినా వినకపోవడంతో వైద్యాధికారిణి కన్నీళ్లు పెట్టుకొని వెళ్లిపోవాల్సి వచ్చింది. ఈ ఘటన మండలంలో కలకలం రేపింది. బాధ్యతాయుతమైన ఉపాధ్యాయులు ఒక మహిళా వైద్యాధికారిణితో వ్యవహరించిన తీరును అందరూ ఖండిస్తున్నారు.

# దుస్థితిలో ముత్తుకూరు లైబ్రరీ

పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న ముత్తుకూరు మండలంలో పాఠశాలలు, గ్రంథాలయాల పరిస్థితి నానాటికి తీసికట్టు నాగంభట్టు సామెతను గుర్తు చేస్తుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లోని ప్రజలకు విజ్ఞానాన్ని అందించేందుకు ఏర్పాటు చేసిన గ్రంథాలయాల తీరు మరీ అధ్వాన్నంగా వుంది. ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లోని ప్రజలకు విజ్ఞానాన్ని అందించేందుకు ఏర్పాటుచేసిన గ్రంథాలయాల తీరు మరీ అధ్వాన్నంగా వుంది. ముత్తుకూరులో గల గ్రంథాలయం శిథిలమై కూలేందుకు సిద్ధంగా వుండడంతో పాఠకులు భయం భయంగా రావాల్సిన పరిస్థితులు

## ఏ పారిశ్రామిక సంస్థ అయినా సహకరించాలి

ఎదురౌతున్నాయి. శ్లాబ్ పెచ్చులూడి పడిపోతుండడంతో ఎవరికి ప్రమాదం సంభవిస్తుందేమోనన్న ఆందోళన నెలకొంటుంది. అసలే అరకొర వసతుల నడుమ నిర్వహిస్తున్న గ్రంథాలయ భవనం శిథిలం కావడంతో పరిస్థితి మరింత దిగజారింది. వర్షాకాలం వచ్చిందంటే పుస్తకాలు, పత్రికలన్నీ తడిసి ముద్దకావాల్సిందే. జిల్లా గ్రంథాలయశాఖ వీటి గురించి అసలు పట్టించుకోకపోవడంతో ఈ పరిస్థితి ఏర్పడిందని గ్రామస్తులు, పుస్తకాల ప్రియులు వాపోతున్నారు.

# తాగునీరు కలుషితం!

బోగోలు మండలంలోని ప్రజలు మంచినీటి కోసం తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. బోగోలు పంచాయితీతోపాటు చుట్టుప్రక్కల పలు గ్రామాల్లో కలుషిత నీరు సరఫరా అవుతుండడంతో ప్రజలు సతమతం అవుతున్నారు. మంచినీటి పైపుల్లో వచ్చే నీటిలో పురుగులు వస్తుండడంతో ఆ నీటిని త్రాగిన ప్రజలు అనారోగ్యానికి గురౌతుండడంతో హడలిపోతున్నారు. మరో మార్గం లేకపోవడంతో గత్యం

## అల్లాడుతున్న బోగోలు వాసులు

తరం లేని పరిస్థితుల్లో కలుషిత నీటినే త్రాగాల్సి వస్తోందని వాపోతున్నారు గ్రామస్తులు. చెంచులక్ష్మీపురంలో ఇదే పరిస్థితి. మురుగునీరు కలుస్తుండడంతో కొళాయి నీరు విషంగా మారింది. పలుమార్లు కలుషితనీటిపై అధికారులకు, పంచాయితీ పాలకులకు ఫిర్యాదు చేసినా పట్టించుకొనే వారే లేకుండా పోయారని ఆయా ప్రాంతాల ప్రజలు వాపోతున్నారు.

## యూనిఫాం పంపిణీ

బోగోలు మండలం నాగులవరం ప్రాథమికోన్నత పాఠశాల విద్యార్థులకు కావలికి చెందిన షిరిడిసాయి సేవా సంస్థ నోటు పుస్తకాలు, యూనిఫాం, ప్లేట్లు, గ్లాసులను పంపిణీ చేసింది. ఇటీవల జరిగిన కార్యక్రమంలో మొత్తం 200 మంది పిల్లలకు సేవాసంస్థ నిర్వాహకులు వీటిని అందజేశారు. ఈ కార్యక్రమంలో పాఠశాల సిబ్బంది పాల్గొన్నారు.

# కలువాయి రాజకీయాల్లో పెనుమార్పులు!

## అటుకులు చిటుకులుగా మారుతున్న నేతలు

కలువాయి మండలంలో రాజకీయ సమీకరణలు చిత్రవిచిత్రమైన మలుపులు తిరుగుతున్నాయి. ఏ నాయకుడు ఎప్పుడు ఏ పార్టీలో వుంటాడో, ఎవరితో జతకడతాడో తెలియని స్థితి నెలకొనింది. మారుతున్న పరిస్థితులను అంచనా వేయడంలో ఇక్కడి నేతలు దిట్టలు. స్వర్గీయ యల్ల రామయ్య మరణానంతరం ఒకే సామాజిక వర్గానికి చెందిన నేతలు మూడు గ్రూపులకు నాయకత్వం వహిస్తూ పెత్తనం సాగిస్తున్నారు. రెండు గ్రూపులు ఒక పార్టీలో వుంటే, మరో గ్రూపు వేరొక పార్టీలో వుండడం ఆనవాయితీ. ఎవరు అధికారంలో వుంటే వారి వెంటనడవడం అలవాటు. అధికార కాంగ్రెస్ పార్టీకి చెందిన మాజీ ఎంపిపి అనిల్‌కుమార్‌రెడ్డి గతంలో తెలుగుదేశం పార్టీలో వున్నాడు. మొన్నటి అసెంబ్లీ ఎన్నికల సమయంలో తిరిగి కాంగ్రెస్ పార్టీకి మారి నేదురుమల్లి వర్గంగా కొనసాగుతున్నాడు. చల్లా శ్రీనివాసులరెడ్డి మొదట్లో బొల్లినేని వర్గంగా, తర్వాత ఆనం వర్గంగా ఉంటూ ఇప్పుడు మేకపాటి సోదరులతో జతకట్టి జగన్ గూటిలో చేరిపోయాడు. తాజాగా జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి జగన్ పార్టీలో చేరబోతున్నట్లు వార్తలు వస్తున్న నేపథ్యంలో కలువాయిలో అతని మిత్రులైన అనిల్‌కుమార్‌రెడ్డి కాకాణి వెంట నడవబోతున్నట్లు సమాచారం. ఇదే జరిగితే చిన్నబుజ్జిరెడ్డి వర్గం జగన్‌ను వీడి టిడిపిలో చేరేందుకు యత్నిస్తున్నట్లు తెలుస్తోంది. ఈ రెండు గ్రూపులది ఇట్లుంటే, మూడో గ్రూపు నేతైన వేణుగోపాలరెడ్డి కార్యకర్తలను చేరదీయడంలో విఫలం అవుతున్నాడు. దీంతో టిడిపి మండల పార్టీ బాధ్యతలు నెల్లూరులో వుండే వ్యక్తికి అప్పగించడంతో కార్యకర్తల మధ్య సమన్వయం కుదరడం లేదు.

## రాజ్‌భవన్‌లో సరికొత్త నిర్మాణాలు!




రాష్ట్రంలో గవర్నర్ ప్రాధాన్యం పెరగనున్నదా! రాజ్‌భవన్‌లో జరుగుతున్న ప్రత్యేక ఏర్పాట్లను చూస్తుంటే ఇది నిజమే అనిపిస్తోంది. గవర్నర్ కోసం ఇప్పటికే ఓ ఛాంబర్ వుండగా ఇప్పుడు మరో కొత్త ఛాంబర్‌ను లక్షలు ఖర్చు పెట్టి నిర్మిస్తున్నారు. పాత ఛాంబర్ ఇరుకుగా వుండటం, సమావేశాలకు అనువుగా లేకపోవడం వల్ల కొత్త కార్యాలయాన్ని విశాలంగా తీర్చి దిద్దుతున్నట్లు రాజ్‌భవన్ వర్గాలు చెబుతున్నాయి. అయితే గవర్నర్‌కు ప్రత్యేక కార్యాలయం అవసరముందా? అధికారులతో గవర్నర్ సమావేశమయ్యే సందర్భాలు కూడా అరుదు కదా అనంటే ఆ వర్గాలు మౌనం వహిస్తున్నాయి. సిఎం పేషీ మాదిరిగా గవర్నర్‌కు కూడా మందీమార్బలం, ప్రత్యేక సహాయకులు వుండేలా రాజ్‌భవన్ కార్యాలయం రూపొందుతోంది. దీంతో త్వరలో 'రాష్ట్రపతిపాలన' కోసమేనా? ఈ 'తంతు' అంటూ రాజధానిలోని రాజకీయవర్గాలు చెవులు కొరుక్కొంటున్నాయి.

## 'రచ్చబండ' రచ్చ



వైఎస్ మొదలు పెట్టిన 'రచ్చబండ' కార్యక్రమం ఇప్పుడు వివాదాస్పదం కానున్నది. ప్రత్యేక తెలంగాణ నేపథ్యంలో ముఖ్యమంత్రి కిరణ్ ఈ కార్యక్రమం ద్వారా తెలంగాణ ప్రజలకు దగ్గర కావాలనుకుంటున్నారు. ప్రజా సంక్షేమ కార్యక్రమాలు, పథకాలు, వ్యక్తిగత ప్రయోజనాలు ఇమిడి వున్న ఈ రచ్చబండ ద్వారా తెలంగాణ వారికి చేరువ కావాలని కిరణ్ భావిస్తున్నాడు. ఈ విషయాన్ని పసిగట్టిన కెసిఆర్ సైంధవుడిలా రచ్చబండకు అడ్డుపడాలని ఇప్పటికే కార్యచరణను రూపొందించాడట. ఈ నెల 24న ప్రారంభం కానున్న రచ్చబండలో సిఎంను నిలదీయాలంటూ పార్టీ శ్రేణులకు తర్ఫీదు కూడా ఇస్తున్నాడట. రచ్చబండ లక్ష్యం నెరవేరితే ప్రత్యేక రాష్ట్రం దృష్టి మళ్లుతుందని కెసిఆర్ కార్యకర్తలకు నూరిపోస్తున్నాడు. రచ్చబండ నిరోధక టీంలను కూడా రంగంలోకి దించి సిఎం లక్ష్యానికి గండికొట్టాలన్న కెసిఆర్ వ్యూహం ఎంతవరకు అమలవుతుందో వేచిచూడాల్సిందే!!

## పెద్దయ్య 'పాత్రలో' రోశయ్య



రాష్ట్ర కాంగ్రెస్‌లో మాజీ ముఖ్యమంత్రి కె.రోశయ్య పెద్దయ్య పాత్రను పోషించనున్నారు. రాష్ట్ర విభజన నేపథ్యంలో తెలంగాణ, సీమాంధ్ర కాంగ్రెస్ నాయకుల మధ్య మాటల యుద్ధం మొదలైంది. దీంతో పార్టీ అధిష్టానం ఇరుకునపడే పరిస్థితి ఏర్పడింది. సొంతపార్టీ వారే ఒకరిపై మరొకరు ఆరోపణలు చేస్తుండటంతో పార్టీ పలచన అవుతోందని అధిష్టానం ఆందోళన చెందుతోంది. దీన్ని నివారించడానికి వీలుగా రోశయ్యను రంగంలో దింపాలని అధిష్టానం నిర్ణయించింది. పార్టీలో సీనియర్‌గా, అన్ని ప్రాంతాల వారికి అభిమాన పాత్రుడుగా వున్న రోశయ్యను పార్టీ సంధానకర్తగా ఉపయోగించుకోవాలని అధిష్టానం అనుకుంటోంది. అధిష్టాన పెద్దలు ఈ మేరకు రోశయ్యకు వర్తమానం పంపారు. పనిలో పనిగా ఓసారి ఢిల్లీకి వస్తే ఇందుకు సంబంధించి 'తర్ఫీదు' కూడా ఇస్తామంటూ రోశయ్యకు కబురు కూడా పంపారట. పెద్దయ్య పాత్రలో రోశయ్య ఏం చేస్తారో చూడాల్సిందే.

## ప్రెస్ సెక్రటరీ బదలీ వెనుక....




ప్రెస్ సెక్రటరీ చంద్రశేఖర్‌రెడ్డిని వదిలించుకోవడంలో సిఎం కిరణ్‌కుమార్ సఫలీకృతుడయ్యాడు. విజయభాస్కర్‌రెడ్డి సిఎంగా ఉన్నప్పటి నుంచి సిఎం పిఆర్‌ఓగా వున్న చంద్రశేఖర్‌రెడ్డి సంవత్సరాలు తరబడి ఆ పోస్టులో పాతుకుపోయాడు. వైఎస్ వర్గానికి అత్యంత సన్నిహితంగా వుంటున్నాడన్న కారణంగా రోశయ్య కూడా చంద్రశేఖర్‌రెడ్డిని వదిలించుకోవాలనుకున్నాడు. అయితే కెవిపి అడ్డుపడటంతో అది నెరవేరలేదు. చంద్రశేఖర్‌రెడ్డి అడపా దడపా జగన్‌తో కూడా మాటామంతీ చేస్తున్నాడని ఎవరో కిరణ్‌కు ఉప్పందించారట. దీంతో కిరణ్ కాస్తంత ఆలస్యమైనా చంద్రశేఖర్‌రెడ్డిని బదలీ చేసి జాగ్రత్త పడ్డాడు. సమాచారశాఖలో అదనపు డైరెక్టర్‌గా వున్న సత్యారావును ప్రెస్ సెక్రటరీగా తెరపైకి తెచ్చారు. అయితే సత్యారావుకు తెలుగుదేశం వర్గాలతో సాన్నిహిత్యం వుందని తెలిసిందట. దీంతో కిరణ్ నాలుక కరుచుకుంటున్నట్లు అభిజ్ఞ వర్గాల భోగట్టా.



## 'లీకు' వీరులతో కెసిఆర్ పరేషాన్



టిఆర్‌ఎస్‌లోని 'లీకు' వీరులతో కెసిఆర్ పరేషాన్ అవుతున్నాడు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఎత్తుగడల్లో తాను రూపొందిస్తున్న రహస్య వ్యూహాలు లీకవుతున్నాయంటూ కెసిఆర్ తలపట్టుకొంటున్నాడు. పార్టీలోని వారే విషయాన్ని ప్రత్యర్థి వర్గాలకు చేరవేస్తున్నారన్నది కెసిఆర్ అనుమానం. తలుపులు మూసివేసి అత్యంత గోప్యంగా నిర్వహించే సమావేశాల వివరాలు కూడా బయటకు పొక్కుతున్నాయట. దీంతో ప్రభుత్వం ముందుగానే జాగ్రత్తపడి వ్యూహాన్ని దెబ్బతీస్తోందన్నది కెసిఆర్ భావన. ఇదే విషయాన్ని కెసిఆర్ పార్టీ శ్రేణులకు కాస్తంత గట్టిగానే చెబుతున్నాడు. పార్టీలోని లీకువీరుల్ని సహించేది లేదంటూ హూంకరిస్తున్నాడు. అవసరమైతే లీకు వీరుల్ని పార్టీ నుంచి బయటకు పంపుతానంటూ హుకూంనామా కూడా జారీ చేశాడు. చూద్దాం ఏం జరుగు తుందో!!



ఎన్టీఆర్ 15వ వర్ధంతి సందర్భంగా నెల్లూరు నర్తకి సెంటర్‌లో జరిగిన సభలో మాట్లాడుతున్న తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. ప్రక్కన కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, బీద రవిచంద్ర, రమేష్‌రెడ్డి, అనూరాధ తదితరులు.

## జాయింట్ కలెక్టర్‌లో ఆకస్మిక మార్పు



నెల్లూరు జాయింట్ కలెక్టర్‌గా సౌరబ్‌గౌర్ బాధ్యతలు తీసుకొని రెండేళ్లకుపైగా అయినా ఆయన ప్రజా సమస్యలపై స్పందించింది ఏమీ లేదనాలి. ఏదో కలెక్టరేటుకు రావడం తన పని తాను చేసుకుపోవడం అలవాటు చేసుకొన్నారాయన. కాని గత మాసం రోజులుగా జె.సి ధోరణిలో మార్పులు కాన వస్తున్నాయి. నగర ప్రజలను దౌర్జన్యంగా దోచుకొంటున్న ఎసి కూరగాయల మార్కెట్‌లోని వ్యాపారులపై దృష్టి పెట్టారాయన. ఈనెల మొదటివారంలో మూడుసార్లు డిఎస్‌ఓ జ్వాలా ప్రకాష్‌ను మార్కెట్‌కు పంపి దాడులు చేయించారు. ఆ తర్వాత మార్కెట్ బినామీ నాయకుడు తాతిరెడ్డిని పిలిపించి వ్యాపారులు పద్ధతులు మార్చుకోకుంటే ఇబ్బందులు పడతారని హెచ్చరించారు. ప్రజలకు ధరతో కన్నీరు తెప్పిస్తున్న ఉల్లిపాయలను కిలో 35 రూపాయలకు అమ్మేలా రైతు బజార్లలో ప్రత్యేక కౌంటర్ తెరిపించారు. కనీస వసతులు లేకపోయినా ప్రేక్షకులను రకరకాలుగా దోచుకొంటున్న సినిమా హాళ్లపై ఆకస్మిక తనిఖీలు చేయించారు. యువకుడైన జాయింట్ కలెక్టర్ ఇదే తరహాలో పనిచేస్తే ప్రజల సమస్యలు కొన్నైనా పరిష్కరింపబడతాయని జనం ఆకాంక్షిస్తున్నారు.

## జడ్పీ ఛైర్మన్‌ను కిండల్ చేసిన వివేకా!



నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి కిండల్ చేయని నేత నెల్లూరుజిల్లా రాజకీయాల్లో వుండరు. గతవారం జ్వరంతో బాధపడి కోలుకున్న ఆయన సంక్రాంతిని పురస్కరించుకొని దర్గా ప్రాంగణంలో కోడింబిళ్ల, గచ్చకాయ ఆట, గోలీలాటను మాజీ మేయర్ భానుశ్రీతో కలిసి వుత్సాహంగా ఆడారు. పనిలో పనిగా వీటి కవరేజికి వచ్చిన ప్రెస్‌తో జడ్పీఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డి ఖచ్చితంగా కాంగ్రెస్‌ను వీడిపోరు. ఆయన జడ్పీ ఆఫీసు ప్రారంభందాకా వుంటారని నర్మగర్భ వాఖ్యలు చేశారు. కాకాణిని సపోర్టు చేస్తున్న సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాలను వుద్దేశించి ముందు ఆయనకు నియోజకవర్గంలో అయిన గాయాలు చూసుకోమనండి. మావల్ల కాకాణి మనసు గాయపడిందన్న విషయం ఆయనకేం తెలుసని రుసరుస లాడారు.

## అత్తారింటికి మంత్రి



రాష్ట్ర మంత్రి అయినా ఆ యింటికి అల్లుడేగా? ప్రాథమిక విద్యాశాఖా మంత్రిగా ఉల్లాసంగా... ఉత్సాహంగా పనిచేసే డాక్టర్ సాకే శైలజానాథ్ నెల్లూరు అల్లుడన్న విషయం అందరికీ తెలిసిందే. ఈసారి పెద్ద పండుగను పురస్కరించుకొని మూడురోజులపాటు పొదలకూరు రోడ్డులోని లేక్‌వ్యూ కాలనీలో వున్న వారి అత్తారింటిలో నిశ్శబ్దంగా వుండిన మంత్రిని నెల్లూరు నేతలు వెళ్లి కలిసి నానాయాగీ చేశారు. పత్రికలు, ఛానళ్ల వారు ఇరుకు సందులకు మంత్రి ఎందుకు వచ్చాడని పరుగెత్తి వెళ్లి వివరాలు రాబట్టారు. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి కోరిన మీదట నెల్లూరు చెరువు దగ్గర బర్నాబాస్ నిర్వహించిన పడవ పందాలలో విజేతలకు మంత్రి స్టీలుపాత్రలు ప్రైజులుగా పంచి పెట్టారు. ప్రశాంతంగా వుందామని వచ్చిన తనను చిరాకు పెట్టినవారిని ఏమి అనలేక పాపం మంత్రి నలిగిపోయినట్లు కనిపించారు.

## మస్తానయ్య సేవలో వెంకయ్య



బిజెపి నేతలు ముస్లిం ప్రార్థనా మందిరాలు, దర్గాలను సందర్శించరు. కాని బిజెపి జాతీయ అధ్యక్షునిగా కూడా వ్యవహరించిన ముప్పవరపు వెంకయ్యనాయుడు దీనికి విరుద్ధం. తన స్వగ్రామాన్ని ఆనుకొని వున్న కసుమూరు మస్తానయ్య దర్గా అంటే ఆయన ఎనలేని భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తుంటారు. తాను కేంద్ర గ్రామీణాభివృద్ధిశాఖా మంత్రిగా వున్నప్పుడు ప్రధాన మంత్రి సడక్‌యోజన పథకంలో కసుమూరుతోపాటు చుట్టుప్రక్కల గ్రామాలకు మంచిరోడ్లు వేయించారు. దర్గా అభివృద్ధికి తనవంతు సహకరిస్తూ ఈవారంలో ఆయన కట్టించిన ఆర్చి, దర్గా లోపల గోడ విస్తరణ పనులను 12తేది ప్రారంభించారు. భార్య, కోడలు, మనుమళ్లతో కలిసి మస్తానయ్యను దర్శించి ఆయన ఆశీస్సులు పొందారాయన.

## హ్యాపీగా కనుమ!



భోగి, సంక్రాంతి, కనుమ పండుగల్లో కనుమకు ఓ ప్రత్యేకత వుంది. భోగి రోజు దోసెలు చికెన్, సంక్రాంతి రోజు సాంబారు అన్నంతో సరిపెట్టుకొనే జనం కనుమ రోజు తప్పనిసరిగా నాన్‌వెజ్ వండుకొంటారు. ముక్కతోపాటు మందు బాబులు జల్సా చేస్తారు. ఈసారి కనుమ పండుగ ఆదివారం రావడంతో అన్ని మతాల వారు చేపలు, మాంసం, చికెన్ మార్కెట్‌లపై పడడంతో 11గంటలకే మటన్, ఫిష్ మార్కెట్‌లో మాయమయ్యాయి. చికెన్ కూడా 12 గంటలకు అదృశ్యమయ్యింది. మాంసాహారాన్ని పది రూపాయలకు ఎక్కువకు అమ్ముకొన్న వ్యాపారులు హ్యాపీగా జాలీగా మధ్యాహ్నానికి ఇళ్లకు వెళ్లిపోయారు.



### కష్టాలను తొలగించే

# సంకష్టహర చతుర్థి వ్రతం

పురాణాల ప్రకారం వినాయకుని ఉపాసన రెండు రకాలుగా చెప్పబడింది. వాటిలో మొదటిది వినాయక చవితి, దాని గురించి అందరికి తెలిసిందే. ఇక రెండవది సంకష్టహర గణపతి పూజ. గణేశుని వ్రతాలలో అత్యంత ప్రభావ వంతమైంది సర్వసంకటాలను నివారించేది సంకష్టహర గణపతి వ్రతం. బహుళ చతుర్దశిని సంకష్టహర చతుర్థి అంటారు. ప్రతి నెలలో ఈ చతుర్థి వచ్చినా మాఘమాసంలో వచ్చే చతుర్థి అత్యంత ప్రాధాన్యతగలది. ఈ పర్వదినాన వినాయకుని అర్చిస్తే సకల కష్టాలు తొలగుతాయని విశ్వాసం. ఆ రోజున గణపతి ఆలయాలలో ప్రత్యేక పూజలు, అభిషేకాలు జరుగుతాయి.

కష్టాలను తొలగించి సుఖసంతోషాలను అందించే సంకష్టహర చతుర్థి వ్రతాన్ని నిష్టతో ఆచరించాలి. సూర్యోదయానికి ముందే లేచి కాలకృత్యాలు తీర్చుకొని స్నానమాచరించి ఇంటిలోని పూజగదిని శుభ్రంగా వుంచుకోవాలి. వివిధ రకాల పుష్పాలతో అలంకరించి పసుపుతో వినాయక ప్రతిమను చేసిగాని లేదా వినాయకుని బొమ్మనుగాని తెచ్చి పీటవేసి దానిపై ప్రతిష్టించాలి. విఘ్నేశ్వరునికి గరిక పూలు అంటే ఎంతో ప్రీతికరం. అందుకని గరిక పూలతో, సుగంధ ద్రవ్యాలతో, పసుపు, కుంకుమలతో గణనాధుని అర్చించాలి. హారతినిచ్చి నైవేద్యం సమర్పించాలి. వ్రతం ఆచరించే వారు సాయంత్రం చంద్రదర్శనం అయ్యేంత వరకు ఉపవాసం వుండి తర్వాతే భుజించాలి.

చంద్రోదయానికి ముందే గణపతి పూజను ముగించి, సంకటహర నివారణాయ అని స్తుతించాలి. జాగరణ వున్నట్లయితే ఎంతో పుణ్యఫలం అని పురాణాలు చెప్తున్నాయి. సకల భయ నివారకుడు, కుజుడి చేత పూజింపబడిన కుజదోష నివారకుడు, యముడి చేత పూజింపబడిన పాపనాశకుడిగా పేరొందిన విఘ్నేశ్వరుని అర్చించినట్లయితే సకల శుభాలు కల్గుతాయని గణేశ పురాణంలో చెప్పబడింది.

ఈ వ్రతానికి సంబంధించి కొన్ని కథలు ప్రచారంలో వున్నాయి. పుత్ర సంతానం కోసం కృతవీర్యుడు తపస్సు చేసి పితృలోకంలో వున్న తండ్రిని కదిలించగా, ఆయన బ్రహ్మదేవుని ప్రార్థించి ఈ వ్రతం గురించి తెలుసుకొని కృతవీర్యునికి స్వప్నంలో దర్శనం ఇచ్చి వ్రతవివరాలను తెలియజేశారు. ఆ విధంగా కృతవీర్యుడు నిష్టగా వ్రతం ఆచరించి కార్తవీర్యార్జునుడి వంటి పుత్రుని పొందినట్లు పురాణాలు పేర్కొంటున్నాయి. అంతటి పుణ్యఫలాలను అందించే సంకష్టహర చతుర్థి వ్రతాన్ని చేయడం వలన సకల కష్టాలు తొలగి సుఖాలు కల్గుతాయని, సంతాన ప్రాప్తి, విద్య, వ్యాపార వృద్ధి కల్గుతుందని, అష్టైశ్వర్యాలు లభిస్తాయని పండితులు పేర్కొంటున్నారు.

# వారఫలాలు

*తేది 22-1-2011 నుండి 28-1-2011 వరకు మకరంలో రవి, కుజులు; ధనుస్సులో బుధ, రాహువులు; వృశ్చికంలో శుక్రుడు; మీనంలో గురువు; కన్యలో శని; మిధునంలో కేతువు; సింహ, కన్య, తుల, వృశ్చికరాశుల్లో చంద్రుడు సంచరిస్తారు.*




వృత్తి రీత్యా ఉత్సాహం అధికమవుతుంది. ఆరోగ్య విషయంలో ఒత్తిడి వల్ల ఇబ్బందులు. కళత్ర సుఖం చక్కగా ఉంటుంది. సంతాన మూలంగా సుఖశాంతులు లోపిస్తాయి. ధన విషయంలో లోటుండదు. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. వ్యాపార విస్తరణ చేస్తారు. విద్యార్థులకు మంచికాలం. వృత్తిపరులకు కీర్తి ప్రతిష్ఠలు పెరుగుతాయి.




పొత్తికడుపునకు సంబంధించి ఇబ్బంది ఉండవచ్చు. జ్వరాదుల పీడ అలర్జీ బాధలుంటాయి. జీవిత భాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. తల్లి అనారోగ్యం చింతనిస్తుంది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు కొంతవరకు మేలు. పోటీలెక్కువ. భాగస్వాములతో జాగ్రత్త, దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు చదువు సాగదు. కళాకారులకు ఆశాభంగం.




బిపి, పైత్యప్రకోపం అధికం. మర్మావయవాల్లో ఇబ్బందులు రావచ్చు. స్పెక్యులేషన్ మంచిది కాదు. ఆర్థిక విషయాలు కటకటగా వుంటాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. వ్యాపారులు అధికంగా కష్టపడాలి. ఉద్యోగులకు పెద్దల తోడు ఉంటుంది.




దీర్ఘరోగులకు ఇబ్బందులుండవచ్చు. కళత్రంతో గొడవలుండవచ్చు. ధన విషయాలలో లోటు లేదు. రుణరూపంలో కూడా ధనప్రాప్తి. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. వ్యాపారులకు పోటీ లధికం. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి ఉండవచ్చు. రాజకీయులకు ఉత్తమకాలం. వృత్తిపరులు లాభపడతారు. వ్యాపారులకు కొంతమేలు.




నిద్రలేమి, జ్వరం వంటి బాధలుంటాయి. గాయాల అవకాశం కలదు. ధనవిషయంలో కటకట ఉండవచ్చు. ఖర్చులధికం. పొదుపు ధనం వృథా అవుతుంది. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండు సార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు తగ్గుముఖం పడతాయి. ఉద్యోగులకు అతికష్టంగా సాగుతుంది. రాజకీయులకు దురదృష్టకాలం. ఉద్యోగినులకు మంచి సమయంకాదు.




ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. నోటికి సంబంధించిన అనారోగ్య బాధలుంటాయి. విదేశీ ప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. రాజకీయులకు మేలైన కాలం. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది. విద్యార్థులకు యోగకాలం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి.

## పంచాంగం

24తేది నేతాజీ సుభాష్ చంద్రబోస్ జయంతి. త్యాగరాజస్వామి ఆరాధన.

26తేది రిపబ్లిక్ డే.

**శుభ ముహూర్తాలు లేవు**

**జనవరి తిథులు**

**పుష్య బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 22 | శని | తదియ | సా.5.46 | గం.ల.వ |
| 23 | ఆది | చవితి | మ.2.42 | గం.ల.వ |
| 24 | సోమ | పంచమి | ప.11.52 | గం.ల.వ |
| 25 | మంగళ | షష్ఠి | ఉ.9.21 | గం.ల.వ |
| 26 | బుధ | సప్తమి | ఉ.7.16 | గం.ల.వ |
| | | అష్టమి | తె.5.40 | గం.ల.వ |
| 27 | గురు | నవమి | తె.4.35 | గం.ల.వ |
| 28 | శుక్ర | దశమి | తె.4.02 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com




హృదయకోశబాధితులు జాగ్రత్తగా ఉండాలి. కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా ఉంటుంది. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. రాజకీయులు తోటి వారి విషయంలో జాగ్రత్తగా ఉండాలి. ఉద్యోగులకు పై అధికారుల సాయం చక్కగా లభిస్తుంది.




కంటికి, ఊపిరితిత్తులకు సంబంధించి ఇబ్బందులుండవచ్చు. కళత్ర సంబంధం చక్కగా ఉంటుంది. పెద్దల సాయంతో ఉద్యోగవృద్ధి, వేతనవృద్ధి ఉంటుంది. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వ్యాపారులు కొత్తసంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు, కళాకారులకు మంచి ఆదరణ. విద్యార్థులకు చదువుచక్కగా సాగకపోవచ్చు.




బి.పి. బాధలుండవచ్చు. మానసిక వేదన ఎదురవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. తోటివారు సాయమందిస్తారు. నూతన మిత్రులు ఏర్పడతారు. నోటికి సంబంధించిన అనారోగ్య బాధలుంటాయి. విదేశీప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వ్యాపారవృద్ధి చక్కగా సాగుతుంది. కొత్త భాగస్వామి లేదా మంచి అనుచరులు లభిస్తారు.




ఆరోగ్యవిషయంలో అతిజాగ్రత్త అవసరం. ప్రమాదాలు గాయాలు సూచితం. పెద్దలతో గొడవలు రావచ్చు. పిల్లల అనారోగ్యం వేదనకు గురి చేస్తుంది. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉన్నా స్పెక్యులేషన్ జోలికి పోవద్దు. తప్పనిసరిగా కొన్ని గృహోపకరణాలు కొనవలసి వస్తుంది. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఉద్యోగులకు, రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.




అలర్జీ, కీళ్లవాతం బాధిస్తాయి. కుటుంబసభ్యుల నుండి సహాయ సహకారాలందవు. ఊహించనిరీతిలో ధనవ్యయమవుతుంది. ఎంత పొదుపు చేయాలనుకున్నా వీలుకాదు. ఇష్టులైన వారికి గాను ఖర్చు అవవచ్చు. గృహనిర్మాణం లేదా వసతి గృహాన్ని అమ్మడం అనే పనులలో నిమగ్నమవుతారు. వ్యాపారులకు, వృత్తిపరులకు మేలైన కాలం గాదు. గృహిణులకు సంతానమూలంగా మనశ్శాంతి ఉండదు.




పేగులకు సంబంధించిన బాధలధికం. సంతానమూలంగా మానసిక వేదనకు గురౌతారు. దైవానుగ్రహానికి ప్రయత్నం చేయండి. ధన విషయంలో తండ్రి సోదరులతో ఇబ్బందులు రావచ్చు. గుట్టుగా కాలం గడపడం మంచిది. ఆర్థిక విషయాలు అంతంత మాత్రమే. ఇరుగుపొరుగువారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. ఎదురు చూచిన సత్ఫలితాలు దక్కవు.

# దిక్కులు సమతుల్యత కోల్పోవడం 'శ్యానకారిష్టం'!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*నెల్లూరు రవిరాజు — గూడూరు*

*★ మా గృహ ఆవరణలో ఆగ్నేయం, నైరుతులు పల్లమై ఇతర దిక్కులు ఎత్తులో వున్నాయి.*

పల్లం కావాల్సిన దిక్కులు ఎత్తుగా, ఎత్తు పెరగాల్సినవి పల్లంగా వుండి దిక్కుల సమతుల్యతకు విచ్ఛిన్నత కలగడాన్ని 'శ్యానికారిష్టం' అంటారు. ఇది గృహ యజమానిని అనేక విధాలుగా దెబ్బతీస్తుంది.

*ఎం.పార్వతి — కర్నూలు*

*★ అపార్టుమెంటు ప్లాట్లలో ఎదురెదురు ద్వారాలు దిష్టి దోషమంటారు.*

నిజమే. రెండు సింహ ద్వారాల నాభిస్థానాలు సరళరేఖ గీచినపుడు తగిలితే దృష్టి దోషమని భరద్వాజ శాస్త్రంలో వున్నది.

*ఎం.ఇంతియాజ్‌అహ్మద్ — నెల్లూరు*

*★ రక్తబలిని వాస్తు శాస్త్రాలు అంగీకరిస్తాయా?*

ఈ సిద్ధాంతాన్ని తీవ్రవాద శైవం ప్రచారం చేసింది. మహర్షులెవరూ ఏ గ్రంథాల్లోనూ ఈ విషయాన్ని గురించి చెప్పలేదు.

*టి.ఎస్.శ్యామలగౌరి — తడ*

*★ వీధి ఒకటి మా అపార్టుమెంటును తాకుతున్నది. క్రింది అంతస్తుకేనా పైవాటిపై కూడా ప్రభావం ఉంటుందా?*

అది నైరుతి వీధిపోటు, చూపు పోట్ల ప్రభావాలు అన్ని అంతస్తులపైనా సమంగానే వుంటాయి. మీరు 'సుదర్శన యంత్ర' ప్రతిష్ఠ చేసుకోండి.

*ఎన్.వి.పరిమళ — నెల్లూరు*

*★ ఆగ్నేయం బెడ్‌రూం, ఈశాన్యం వంటగది వున్న ప్లాటు కొనుగోలు చేయవచ్చా?*

ఆగ్నేయం దంపతులకు కలహం. ఈశాన్యం అనారోగ్య, ఆర్థిక భంగం అందుచేత కొనకూడదు.

*ఎన్.పెంచలరెడ్డి — గూడూరు*

*★ గూడూరులో ఏ ఇంట్లో చూసినా సమస్యలు. పరిష్కారం ఏమిటి?*

తూర్పు, దక్షిణ దోషాలధికం. దక్షిణం చెరువు ఊరి వాస్తు సమతుల్యతను దెబ్బతీసింది. ప్రజలు వాస్తు నిర్మాణాల్లో శ్రద్ధ తీసుకున్నప్పటికీ అక్కడ దిక్ప్రభావాలెక్కువ. యంత్ర ప్రతిష్ఠలే మార్గం!

*సి.హెచ్.సీతాలక్ష్మి — నాయుడుపేట*

*★ తూర్పు స్థలం. రోడ్డు దక్షిణం నుంచి ఉత్తరం వెళ్లి దేవాలయం గోడ దగ్గర ఆగిపోయింది.*

ఏ రోడ్డు కూడా ఇంటి సమీపంలో ఆగిపోకూడదు. మీ ఉత్తరాన్ని బట్టి ఉత్తరంలో దేవాలయం వున్నట్లుంది. అందువల్ల ఆ స్థలం కొనకపోవడమే మంచిది.

*వి.శకుంతలాదేవి — చెన్నై*

*★ ఈ మధ్య సెప్టిక్‌ట్యాంకు ఏ మూలలోనూ ఉండరాదని మీరు చెబుతున్నారు.*

ఈశాన్యం మృత్యువు, ఆగ్నేయం స్త్రీ వ్యాధి, నైరుతి సర్వానర్థదాయకం, వాయువ్యం మానసిక ఒత్తిడి, విరోధాలు అని శాస్త్రాలు చెబుతున్నాయి.

*ఎం.హిమబిందు — చిత్తూరు*

*★ మూడు ద్వారాలు రాకూడదంటే అర్థం ఏమిటి?*

ఎదురెదురుగా మూడు ద్వారాలే కాదు. 'బేసి సంఖ్య'లో కూడా ద్వారాలు రాకూడదు.

*దిరిశెన రాఘవరెడ్డి — పెళ్లకూరు*

*★ అపార్టుమెంటులో 'లిఫ్టు' ఏ దిక్కులో రాకూడదు.*

నాలుగు దిక్కుల్లో రాకూడదు. దిశల్లో మధ్య భాగంలో అంటే దిక్కుల్లో మధ్య భాగంలో రావాలి.

*టి.తిరుపాలు — చిత్తూరు*

*★ మా యింట్లో 11 ద్వారాలున్నాయి.*

మూడు వైధవ్యం, ఐదు అనారోగ్యం, ఏడు దారిద్ర్యం, పదకొండు మానసిక ఒత్తిళ్లు కల్గిస్తాయని 'మయవాస్తు' సూత్రం.

*హెచ్.సిద్ధారెడ్డి — హైదరాబాద్*

*★ ఆరోగ్యానికి ఏ అంతస్తు మంచిది?*

లిఫ్టు ఎక్కకపోతే చివరి అంతస్తు ఆరోగ్యకారకం.

# కాలుష్యంపై గళమెత్తుతున్న ప్రతిపక్షం!

**రాష్ట్రంలో ఎక్కడా లేనట్లు జిల్లాలో 32వేల మెగావాట్ల థర్మల్ విద్యుత్ ఉత్పత్తి లక్ష్యంగా 22 విద్యుత్ కేంద్రాల నిర్మాణానికి ప్రభుత్వం అనుమతించింది. ఒకేచోట వీటి నిర్మాణం వల్ల పర్యావరణానికి ముప్పు ఏర్పడుతుందన్న భయం ప్రజలను పట్టి పీడిస్తోంది.**

జిల్లాలో విద్యుత్ థర్మల్ ప్రాజెక్టుల కారణంగా ఏర్పడనున్న కాలుష్యంపై ఆందోళన ఉధృతం చేసేందుకు ప్రతిపక్ష పార్టీలు సిద్ధమవుతున్నాయి. కాంగ్రెస్ పార్టీ మినహా జిల్లాలోని ఇతర రాజకీయ పార్టీలు, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో ఈ నెల 24వ తేది నుంచి వివిధ రూపాల్లో కాలుష్యంపై ఆందోళన చేపట్టనున్నారు. జిల్లాలో ప్రధానంగా చిల్లకూరు మండలంలో ఎక్కువ బొగ్గు ఆధారిత పరిశ్రమల ఏర్పాటుకు ప్రభుత్వం భూములు కేటాయించడంతోపాటు నిర్మాణాలకు అవసరమైన అనుమతులు జారీచేసింది. అనుమతి పొందిన పరిశ్రమలన్నీ నిర్మాణాలు పూర్తి చేసుకుంటే సమీప గ్రామాల ప్రజలతోపాటు నెల్లూరు నగర ప్రజలు కాలుష్యం బారినపడే ప్రమాదం వుంది.

చిల్లకూరు మండలంలో 15, ముత్తుకూరు మండలంలో ఐదు, వెంకటాచలం మండలంలో రెండింటికి ప్రభుత్వ అనుమతులు వున్నాయి. మొత్తం 32వేల మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి లక్ష్యంగా థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుల రూపంలో జిల్లా ప్రజానీకానికి ముప్పు ముంచుకొస్తుందని పర్యావరణ శాస్త్రవేత్తల అభిప్రాయం. అనుమతి పొందిన ప్రాజెక్టులు ఉత్పత్తి మొదలు పెడితే రోజుకు ఐదున్నర లక్షల టన్నుల బొగ్గు కాలుతుంది. దీంతో లక్షన్నర టన్నుల బూడిద విడుదలవుతుంది. కార్బన్ డై ఆక్సైడ్, సల్ఫర్ డై ఆక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్ లాంటి విషవాయువులు, పాదరసం, ఆర్గానిక్, సీసంలాంటి భారీ లోహాలు వాతావరణంలోకి విపరీతంగా విడుదలవుతాయని ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

పారిశ్రామికంగా జిల్లాను అభివృద్ధి పథంలో తీసుకెళతామని చెబుతున్న ప్రభుత్వం ప్రజల ఆరోగ్యానికి, ప్రాణాలకు ముప్పువాటిల్లే బొగ్గు ఆధారిత పరిశ్రమలకు అనుమతినివ్వడం పట్ల నిరసన వ్యక్తమవుతున్నది. పవర్ ప్రాజెక్టుల నుంచి వెలువడే విషవాయువుల కారణంగా గుండె జబ్బులు, చర్మ వ్యాధులు, క్యాన్సర్ లాంటి రోగాలబారిన పడడం తోపాటు, సాగునీరు, త్రాగునీరు కలుషితమై పంటల దిగుబడి దాదాపు ముప్పై శాతం వరకు తగ్గిపోయే ప్రమాదం వుందని పర్యావరణ నిపుణులు హెచ్చరిస్తున్నారు. ఈ హెచ్చరికల నేపథ్యం తోనైనా ప్రభుత్వం పవర్ ప్రాజెక్టుల ఏర్పాటుకు అనుమతి నిరాకరిస్తుందని ఆశాభావం వ్యక్తం చేస్తున్నారు.

అయితే ప్రభుత్వం పవర్ ప్రాజెక్టులకు మరిన్ని అనుమతులు ఇవ్వనుండడంతో భవిష్యత్తులో కాలుష్యం కారణంగా ఏర్పడబోయే ముప్పు గురించి జిల్లా ప్రజానీకానికి వివరించడంతోపాటు ఉద్యమం చేపట్టడానికి నడుం బిగించారు ప్రతిపక్ష నేతలు. పరిశ్రమలు ఏర్పాటుచేస్తున్న సమీప గ్రామాల ప్రజలను సైతం కాలుష్య వ్యతిరేక ఉద్యమంలో భాగస్వాములను చేయ తలపెట్టారు. తొలుత గ్రామ స్థాయి నుంచి ఉద్యమానికి శ్రీకారం చుట్టాలని నిర్ణయించారు. రైతుల నుంచి తీసుకున్న భూములకు అరకొర నష్టపరిహారం చెల్లించడంతో వారు వలస కూలీలుగా మారిన వైనాన్ని వివరిస్తారు.

జిల్లాకు చెందిన అధికార పార్టీ ఎమ్మెల్యేలు మంత్రిపై ఒత్తిడి తెచ్చి ఆపై పవర్ ప్రాజెక్టుల నిర్మాణాల కారణంగా తలెత్తే ఇబ్బందులను వివరించే విధంగా డిమాండ్ చేస్తారు. ఏదిఏమైనా జిల్లాలోని కాంగ్రెస్ మినహా ఇతర రాజకీయ పక్షాలు, ప్రజా సంఘాలు, పర్యావరణ సంస్థలు కాలుష్యంపై గళ మెత్తి ఉద్యమించాలని నిర్ణయించడం శుభపరిణామంగా భావించవచ్చు.



గిరిజనుల బతుకులు

# గిరిజనుల బతుకుల్లో ఆవగింజంత మార్పు లేదు!

**నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు, కడప జిల్లాలలో దుర్భర జీవితాన్ని అనుభవిస్తున్న గిరిజనుల బతుకుల్లో మార్పుకు ఐటిడిఏ ప్రాజెక్ట్ ఏ మాత్రం ఉపయోగపడలేదని ఇటీవల నెల్లూరులో జరిగిన ఆ సంస్థ గవర్నింగ్ బాడీ సమావేశంలో ప్రజాప్రతినిధులు తేల్చి చెప్పేశారు.**




గవర్నింగ్ బాడీ సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ రాంగోపాల్. ప్రక్కన ఎమ్మెల్సీ రామిరెడ్డి, తిరుపతి ఎమ్పీ చింతామోహన్, కమిషనర్ శాంతకుమారి, జడ్పీ ఛైర్మన్ గోవర్ధన్‌రెడ్డి.

ఇటీవల నెల్లూరు నగరంలో సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ (ఐటిడిఏ) గవర్నింగ్ బాడీ సమావేశం జరిగిన తీరు చూస్తుంటే ఇంకో 50 సంవత్సరాలు గడిచినా కూడా గిరిజనుల బ్రతుకులు మారవని తెలుస్తుంది. నెల్లూరు, ప్రకాశం, చిత్తూరు, కడపజిల్లాలకు చెందిన గిరిజనులు, చల్లాయానాదుల సంక్షేమం కోసం ఐటిడిఏను ఏర్పాటు చేసింది ప్రభుత్వం. కాల్వగట్లపై నివాసం ఏర్పాటు చేసుకొని దుర్భర జీవనం సాగిస్తున్న గిరిజనుల జీవితాల్లో వెలుగునింపాలన్న ప్రభుత్వ సంకల్పం మాత్రం నెరవేరకుండాపోతోంది.

గిరిజనుల సంక్షేమం కోసం కేటాయిస్తున్న నిధులు సక్రమంగా వినియోగించడం లేదన్న ఆరోపణలు వున్నాయి. నాలుగు జిల్లాలకు సంబంధించి అమలు కావాల్సిన పథకాలు కూడా అమలుకు నోచుకోవడం లేదని గవర్నింగ్ బాడీ సమావేశంలో పాల్గొన్న పలువురు ప్రజాప్రతినిధులు అసంతృప్తి వ్యక్తం చేయడంపై గిరిజన సంక్షేమశాఖ పనితీరు ఎలా వుందో అర్థం చేసుకోవచ్చు. ఈశాఖ పనితీరుపై మొదటి నుంచి కూడా అనేక ఆరోపణలున్నాయి. పరిపాలనాపరంగా అనేక లొసుగులు కనిపిస్తున్నా వీటిని అధిగమించి గిరిజనుల సంక్షేమంపై దృష్టి సారించి అమలుచేసే అధికారిని మాత్రం నియమించేందుకు ప్రభుత్వం చర్యలు చేపట్టడం లేదు. ఇతర జిల్లాల్లో ఐఏఎస్ అధికారిని ఐటిడిఏ ప్రాజెక్టు అధికారిగా నియమిస్తున్న ప్రభుత్వం నెల్లూరుకు మాత్రం ఇతరశాఖల నుంచి డిప్యూటేషన్‌పై వచ్చిన వారిని పి.ఓగా నియమిస్తుండడాన్ని గిరిజన సంఘాల ప్రతినిధులే వ్యతిరేకిస్తున్నారు. ఐఏఎస్ అధికారిని నియమిస్తే పరిపాలన సవ్యంగా జరగడం తోపాటు గిరిజనుల సంక్షేమం కోసం సరైన కార్యాచరణ ప్రణాళికను తయారు చేసి అమలు చేసే అవకాశం వుంటుందని ఈ సంఘాల నేతల అభిప్రాయం. ఇప్పటి వరకు 10, 20 వేల రూపాయలు ఆర్థిక సహాయం అందిస్తూ వస్తున్నారు. వీటిలో కూడా అవకతవకలు చోటు చేసుకొంటున్నాయని బాధితులు వాపోతున్నారు.

గిరిజనులకు భూములు కేటాయించి వాటిని అభివృద్ధి చేస్తే జీవన ప్రమాణాలు మెరుగుపడతాయని ప్రభుత్వం ఎప్పుడో భావించింది. అయితే క్షేత్ర స్థాయిలో భూముల అభివృద్ధికి సంబంధించి పథకాలు అమలు కావడం లేదు. కొందరు గిరిజనులు వ్యవసాయం పట్ల ఆసక్తి చూపేందుకు ముందుకు రాకపోవడంతో వీరికి అవసరమైన పథకాలు అమలు చేసేందుకు అధికారులు ముందుకు రాకపోవడంపై గిరిజన సంక్షేమ శాఖ కమిషనర్ శాంతకుమారి అసహనం వ్యక్తం చేశారు. గవర్నింగ్ బాడీ సమావేశంలో గిరిజనుల జీవన విధానం వారి అభివృద్ధికి ప్రభుత్వం విడుదల చేసిన నిధులు, పథకాల అమలు తీరుపై సమగ్రంగా చర్చించి నప్పటికి అధికారుల నుంచి సరైన స్పందన రాలేదు.

తిరుపతి పార్లమెంటు సభ్యులు డాక్టర్ చింతామోహన్ కూడా గిరిజన సంక్షేమశాఖ అధికారులు వ్యవహరిస్తున్న తీరుపై అసంతృప్తి వ్యక్తం చేశారు. ఏ లక్ష్యం కోసం ఐటిడిఏను ప్రభుత్వం నెలకొల్పిందో ఆ లక్ష్యాలను సాధించడంలో సంబంధితశాఖ అధికారులు పూర్తిగా వైఫల్యం చెందుతున్నారని పని తీరు మార్చుకోవాలని హితవు పలికారు. విద్యాపరంగా కూడా నేటికి వెనుకబడి వున్నారని ఎమ్మెల్యే రామిరెడ్డి ఆవేదన వ్యక్తపరిచారు. రాష్ట్రస్థాయి అధికారులు సరైన పర్యవేక్షణ చేయకపోవడంతో జిల్లాస్థాయిలో అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ గిరిజనుల సంక్షేమం గురించి పట్టించుకోవడం లేదని విమర్శలు గుప్పించారు.

ప్రజాప్రతినిధులు చేసిన వ్యాఖ్యలకు విస్తుపోయిన కమిషనర్ శాంతకుమారి వాస్తవాలను అంగీకరించక తప్ప లేదు. ఇప్పటికైనా అధికారుల్లో మార్పు వస్తుందో లేదో వేచి చూడాలి.



## కురచ దుస్తుల సుందరి

కమల్‌హసన్ కుమార్తె శ్రుతి పేరు చెప్పగానే గుర్తుకు వచ్చేది హిందీలో ఆమె నటించిన లక్ సినిమానే. ఆ సినిమా బాక్సాఫీసు దగ్గర పరాజయం పాలైనా... లక్‌తో శ్రుతి బికినీలో జలకాలాడిన సన్నివేశాలను ప్రేక్షకులు మరువరు. హిందీలోనే నటించిన రెండవ చిత్రం దిల్‌తో బచ్చాహైజీలోనూ ఆమె కురచ దుస్తులతోనే సాగరతీరాన ఆడిపాడింది. తెలుగులో ఆమె నటించిన అనగనగా ఓ ధీరుడు చిత్రంలో యువరాణిగా ఆమె ధరించిన దుస్తులతో ప్రత్యేక గుర్తింపు తెచ్చుకొంది. ఈ సినిమా నటిగా తనకు కొత్త అనుభూతి నిచ్చిందని, వైవిధ్యమైన కథాంశంతో వుండే ఈ చిత్రాన్ని భాషలతో సంబంధం లేకుండా అందరూ చూడాలంటుంది.



## సమంత డైరీ ఫుల్!



2011 డైరీ ఫుల్‌గా వున్న హీరోయిన్ సమంత. మహేష్‌బాబు సరసన నటిస్తున్న దూకుడు షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడింది. నేను బిజీ కావడానికి దర్శకులు గౌతమ్‌మీనన్‌నే కారకులు. ఆయన 'ఏమాయ చేసావె' చిత్రంలో హీరోయిన్‌ను చేయకుంటే ఎక్కడ వుండేదానినో. ఈ యేడాది దూకుడు, ఎర్రగులాబీలు, ఈగ చిత్రాలతోపాటు మరో మూడు చిత్రాలలో నటిస్తాను. వాణిజ్య ఒప్పందాలు పెరిగాయి. ప్రారంభోత్సవాలకు నన్ను ఆహ్వానిస్తున్నారు. నాకు తెలిసి నేను అందగత్తెను అని అనుకోను. బహుశా సినిమాలో నేను పోషించిన పాత్రలే నాకు అందాన్ని తెచ్చి పెట్టాయి. చేసే పనిలో ప్రయత్న లోపం లేకుండా... వచ్చిన పాత్రల్ని సమర్థవంతంగా పోషించగలిగితే ప్రేక్షకులు తప్పకుండా ఆదరిస్తారన్న నమ్మకం వుంది.

## సమీరా... పెళ్లికి రెడీ!



తెలుగమ్మాయి సమీరారెడ్డి... బాలీవుడ్‌లో హీరోయిన్‌గా స్థిరపడిపోయింది. 2010లో ఆమె అక్క మేఘనారెడ్డి పెళ్లి చేసుకొంది. మీ పెళ్లెప్పుడని సమీరాను అడిగితే 2011లో చేసుకొంటానని మా నాన్నకు చెప్పాను. నా చేతిలో ప్రస్తుతం మూడు చిత్రాలున్నాయి. అవి అయిపోగానే పెళ్లిపీటలపై కూర్చొంటాను. నేను పెద్దలమాట జవదాటను. నా అభిప్రాయాల్ని వాళ్లు పరిగణనలోకి తీసుకొంటారు. మొత్తం మీద వారు నేను మెచ్చే, వారికి నచ్చే అబ్బాయితో నా పెళ్లి కుదురుస్తారన్న నమ్మకం వుందంది.

## ఆయన మంచోడు కాబట్టే...



అభిషేక్ బచ్చన్‌తో వివాహం జరిగాక ఐశ్వర్యరాయ్‌లో మార్పులేమైనా వచ్చాయా? వ్యక్తిగతంగా, వృత్తిపరంగా మారారా అని ఆమెను ప్రశ్నించాను. దీనికి స్పందిస్తూ వివాహం అమ్మాయి జీవితంలో మరో మలుపు లాంటిది. నేను అభిని కాకుండా మరొకరిని పెళ్లి చేసుకొని వుంటే నేను కూడా మారాల్సి వచ్చేదెమో? నాకు ఆయన పూర్తి స్వేచ్ఛ ఇచ్చాడు. నా సినిమా ఎంపికలో ఆయనెప్పుడూ జోక్యం చేసుకోలేదు. అనవసరంగా సలహాలు గూడా ఇవ్వడు. రావణ్, రోబో ఈ సినిమాలన్నీ నా వ్యక్తిగత ఇష్టాలతో ఎంచుకొన్నవే. గుజారిష్ గూర్చి కూడా ఇంట్లో ఎక్కువ చర్చ జరగలేదు. నువ్వు ఏం అనుకొంటే అది చేయ్ అంటూ ప్రోత్సహించాడు. సెట్లో ఎంత హుందాగా ప్రవర్తించాలో నేర్పించాడు. అమితాబ్ వంటి గొప్ప వ్యక్తి కుటుంబంలో సభ్యురాలిని కావడం ఎంతో ఆనందాన్ని, అంతకు మించి గర్వంగా వుందంటుంది.

## సంతోషంగానే వున్నాను



2010లో తాను నటించిన మూడు చిత్రాల్లో డార్లింగ్, బృందావనం బాగా ఆడాయంటుంది హీరోయిన్ కాజల్. ఈ యేడాది చివరిలో కాస్త గందరగోళం రేగింది. రామ్‌చరణ్ హీరోగా తీస్తున్న మెరుపు చిత్రంలో నన్ను హీరోయిన్‌గా తప్పించారని ఫిల్మ్‌నగర్‌లో దూమారం రేగింది. మొత్తం మీద నేను రామ్‌చరణ్ సరసన నటించే చిత్రం ఈ యేడాది విడుదలవుతుంది. మెరుపుతోపాటు మిస్టర్ ఫర్‌ఫెక్ట్, వీర, నాగచైతన్యతో నేను నటించే చిత్రాలు ఈ యేడాది ప్రేక్షకుల ముందుకు రాబోతున్నాయి. ఇవన్నీ మాస్ చిత్రాలు. నా రేంజ్ మరింత పెంచుతాయి. కాబట్టి 2011లో కూడా అన్ని శుభాలు జరుగుతాయని ఆకాంక్షిస్తున్నానంది.

## పరమ వీర చక్ర – పరవాలేదు!



అల్లూరు రహీం

దర్శకరత్న దాసరి నారాయణరావు దర్శకత్వం వహించిన 150వ చిత్రం పరమవీరచక్ర. దాసరి నారాయణరావు దర్శకత్వంలో హీరో బాలకృష్ణ నటించిన తొలి చిత్రం పరమవీరచక్ర కావడంతో ఈ సినిమాపై ప్రేక్షకుల్లో అంచనాలు విపరీతంగా పెరిగాయి. అయితే ఈ చిత్రం అనుకొన్నంత గొప్పగా లేకపోయినా ఒక్కోసారి దాసరి నారాయణరావు తీసే గబ్బు చిత్రంగా మాత్రం లేదు. ఈ చిత్రంలో మొదటి సీన్‌గా చూపే బొబ్బిలిపులి సినిమా ప్రభావం ఈ చిత్రంపై బాగా పని చేసింది. ఆ చిత్రంలోని కోర్టుసీను, మిలట్రీ పాట, డైలాగులు పరమవీరచక్రలోనూ కనపడ్డా కొన్ని ప్రత్యేకతలు ఈ చిత్రంలో వున్నాయి. సినిమా ప్రధమార్థంగా ఈ చిత్ర కథానాయకుడు సినిమా హీరో కావడం వల్ల పరిశ్రమలోని దర్శకులు కోడి రామకృష్ణ, సింగీతం శ్రీనివాసరావు, బి.గోపాల్, శ్రీధర్, బోయపాటి శీను తదితరులంతా కనిపిస్తారు. కథలో భాగంగా బాలకృష్ణ చేసిన రావణబ్రహ్మ, కొమరం భీమ్ ఏకపాత్రాభినయాలు బాగున్నాయి. దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం వహించినట్లు టైటిల్స్‌లో వేసుకొన్నా, మాటల రచయితలు రాజేంద్రకుమార్, జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు వంటి వారు ఆయనకు సహకరించినట్లుంది. అందువల్లే చిత్రంలో సాగదీత డైలాగులు తగ్గాయి. కానీ అక్కడక్కడా బాలకృష్ణ కోసమన్నట్లు నేను యాక్షన్‌లో వుండగా రియాక్షన్ వుండకూడదు. ధర్మం కన్నా వృత్తి ధర్మం ఎక్కువ. ఢిల్లీని కదలించిన చరిత్ర మాది. నటులు తక్కువ కాదు... ఎమ్జీఆర్, ఎన్టీఆర్ సిఎంలయ్యారు. మా హీరో సిఎం కావచ్చు వంటి డైలాగులు కొనసాగాయి. షీలా, అమీషాపటేల్, నేహ ధూపియాలు ఈ చిత్రంలో హీరోయిన్లు. వీరి పాత్రలు మరీ కుదించి వేయడం వల్ల వారుండీ ప్రయోజనం లేకుండా పోయింది. బాలీవుడ్‌లో సెక్సీణిగా ఇమేజ్ వున్న నేహ ధూపియాను బికినీతోపాటు 'మై క్యాకరు బోలో' పాటలో సెక్సీగా చూపించారు. రావణబ్రహ్మ పాత్ర పాడే పద్యం, సుద్దాల ఆశోక్‌తేజ వ్రాసిన లోకాన చీకటి, రామజోగయ్య శాస్త్రి వ్రాసిన అర్జున, ఫల్గుణ పాటలు బాగున్నాయి. దాసరి నారాయణరావు వ్రాసిన రెండు పాటల్లో తల్లి కడుపులో పెరిగిన బిడ్డపై చరణంతో సాగే పాటలో జననీ జన్మభూమిశ్చ పాట ఛాయలున్నాయి. ఈ పాటలో ఆయన అందించిన జాతీయ జెండాకు బుల్లెట్ ప్రూఫ్ వందనం ఆగాలన్న సందేశం బాగుంది. రోబో సినిమా తరహాలో అలీ, హేమ, బ్రహ్మానందం బృందం చేసిన కామెడీ బాగా పండింది. నెల్లూరీయుడు వివాదాస్పద నిర్మాత సి.కళ్యాణ్ ఖర్చుకు వెరవక ఈ చిత్రాన్ని హిమాచల్‌ప్రదేశ్‌లోని మంచు కొండల్లో నిర్మించాడు. ఇక్కడి అందాలతోపాటు చిత్రంలో మిగతా సన్నివేశాలను కెమెరామెన్ రమణబాబు ప్రతిభావంతంగా చిత్రీకరించాడు.

ఇక చిత్రకథలోనికి వెళ్తే సినిమా హీరో చక్రధర్(బాలకృష్ణ) పరిశ్రమలో మంచి ఫాలోయింగ్ వున్న హీరోగా విభిన్న పాత్రలతో ప్రేక్షకులను అలరిస్తుంటాడు. హీరో తల్లి(జయసుధ)కు ఆమె అన్న (స్వర్గీయ ఎన్టీఆర్)లా తన కొడుకుని మిలట్రీ మేజర్‌గా చూసుకోవాలంటే ఇష్టం. ఒకసారి దర్శకుడు కాశీవిశ్వనాథ్‌తో కలసి మిలట్రీ మేజర్ జితేంద్ర(మురళీమోహన్) హీరో చక్రధర్ దగ్గరకు వస్తాడు. తన దగ్గర ఓ కథ వుందని మిలట్రీలో తన సహధ్యాయి అయిన మేజర్ జయసింహ కథ చెబుతాడు. ఈ కథ విని హీరో చక్రధర్ ఆ పాత్రలో పరకాయ ప్రవేశం చేస్తాడు. మేజర్ జితేంద్ర హీరో చక్రధర్‌ను హిమాచల్‌ప్రదేశ్‌లోని మిలట్రీ క్యాంపుకు తీసుకవెళ్తాడు. అక్కడ అపస్మారక స్థితిలో వున్న మేజర్ జయసింహను చూపిస్తాడు. జయసింహ అచ్చు హీరో చక్రధర్‌ను పోలి వుంటాడు. ఆయన కేంద్ర మాజీ మంత్రి దాదాజీని పాకిస్తాన్ టెర్రరిస్టులు కిడ్నాప్ చేయగా ప్రాణాలకు తెగించి విడిపిస్తాడు. కరుడుగట్టిన నవాఖైదా టెర్రరిస్ట్ ఘని(రాజ్‌ప్రేమి)ని అదుపులోకి తీసుకొంటాడు. దీనికి ప్రతిగా మేజర్ కుటుంబాన్ని ఉగ్రవాదులు ఊచకోత కోస్తారు. జార్ఖండ్‌కు చెందిన మాజీ కేంద్ర మంత్రి దాదాజీకి పాకిస్తాన్ టెర్రరిస్టులతో వున్న సంబంధాలను మేజర్ జయసింహ తెలుసుకోవడంతో ఆయన రజియా సుల్తానా (నేహధూపియా)ను రంగంలోకి దింపి మేజర్‌ను మిలట్రీ కోర్టులో దేశద్రోహిగా నిరూపిస్తాడు. ఈ మచ్చను చెరపను మేజర్ జితేంద్ర సలహ మేరకు ఆయన రూపంలో వున్న హీరో చక్రధర్ రంగంలోకి దిగి ఒక పథకం ప్రకారం దేశ ద్రోహులందర్నీ మట్టుబెడతాడు. చివరన కోర్టులో తాను మేజర్ జయసింహను కాదని, హీరో చక్రధర్‌ను అని చెప్పి, దేశభక్తుడైన జయసింహకు పరమవీరచక్ర బిరుదునివ్వమని కోర్టుకు సలహ ఇస్తాడు. కోర్టు హీరో చక్రధర్ చట్ట విరుద్ధమైన పనిచేసినా క్షమిస్తుంది. మేజర్ జయసింహకు పరమవీరచక్ర బిరుదునివ్వమని కేంద్ర ప్రభుత్వానికి సిఫార్సు చేయడంతో చిత్రం ముగుస్తుంది.




ఈ చిత్రంలో మిగతా నటులకు పెద్ద పాత్రలు లేవు. బాలకృష్ణ మేజర్‌గా, హీరోగా బాగా నటించాడు. పరమవీరచక్రతో దాసరి నారాయణరావు అదృష్టం మారొచ్చు. ఆయనకు మరిన్ని చిత్రాలకు దర్శకత్వం వహించే అవకాశం రావచ్చు. అయితే పరమవీరచక్ర లాంటి సందేశాత్మక చిత్రాలు నేటి యువతరం అంతగా మెచ్చరేమో!




ముప్పవరపు ఫౌండేషన్

# విజ్ఞాన వినోద కేంద్రం!

బిజెపి సీనియర్ నేత ముప్పవరపు వెంకయ్యానాయుడు ఆధ్వర్యంలో పాత స్పిన్నింగ్ మిల్ స్థలంలో ఏర్పడిన రిత్విక్ ఎన్‌క్లేవ్‌లోని మునిసిపల్ రిజర్వు స్థలంలో ముప్పవరపు ఫౌండేషన్ పేరిట విజ్ఞాన, వినోద కేంద్రం ఏర్పాటైంది. వెంకయ్య నాయుడు కుమారుడు హర్షవర్ధన్ ఛైర్మన్‌గా వ్యవహరించే ఈ ఫౌండేషన్ ప్రారంభోత్సవం జనవరి 14వ తేది జరిగింది. రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ముఖ్య అతిథిగా హాజరై దీనిని ప్రారంభించారు. రామనారాయణరెడ్డి మాట్లాడుతూ వెంకయ్యానాయుడు చేపడుతున్న పలు సేవా కార్యక్రమాలను ప్రశంసించారు. ప్రజలకు విజ్ఞానాన్ని, వినోదాన్ని అందించేందుకు ముప్పవరపు ఫౌండేషన్, నగర పాలక సంస్థ సంయుక్తంగా దీనిని ఏర్పాటు చేయడం అభినందనీయమన్నారు. మునిసిపల్ రిజర్వు స్థలాలు

### స్పిన్నింగ్ మిల్ లేఅవుట్‌లో మంచి పని

దురాక్రమణకు గురౌతుండడంతో ప్రైవేట్ సంస్థలకు ఈ స్థలాన్ని అప్పగించవద్దని సుప్రీంకోర్టు తీర్పిచ్చి వుందన్నారు. అయితే ఇక్కడ మాత్రం అన్ని అనుమతులతో ముప్పవరపు ఫౌండేషన్ ఆధ్వర్యంలో ఈ కేంద్రం ఏర్పాటైందన్నారు. మునిసిపల్ స్థలాలను కాపాడుకోవాల్సిన బాధ్యత మునిసిపల్ కమీషనర్లదేనన్నారు. వెంకయ్యానాయుడు మాట్లాడుతూ ప్రజోపయోగ కార్యక్రమాలు నిర్వహించే సంస్థలకు రిజర్వు స్థలాలను అప్పగిస్తే మంచి జరుగుతుందన్నారు. రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి మాట్లాడుతూ వెంకయ్యానాయుడు చేపడుతున్న పలు సేవా కార్యక్రమాలను ఈ సందర్భంగా ప్రస్తావించి అభినందించారు. అనంతరం రిత్విక్ ఎన్‌క్లేవ్ పేరును మార్చి ఈ ప్రాంతాన్ని సర్దార్ వల్లభాయ్ పటేల్ కాలనీగా నామకరణం చేశారు.

● హాకీ అసోసియేషన్‌కు

# గుర్తింపు వుంది!



జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఏర్పాటుచేసిన హాకీ అసోసియేషన్‌కు గుర్తింపు లేదని వచ్చిన ఆరోపణలపై గోవర్ధన్‌రెడ్డి వివరణ ఇచ్చారు. ఈ నెల 16వ తేది హాకీ అసోసియేషన్ ప్రతినిధులతో సమావేశం జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో ఇండియన్ హాకీ ఫెడరేషన్ జారీచేసిన గుర్తింపు పత్రాలను చూపించారు. ఇంటర్నేషనల్ హాకీ ఫెడరేషన్‌కు అనుబంధంగా వున్న ఇండియన్ హాకీ ఫెడరేషన్ ప్రతినిధులు గుర్తింపును జారీ చేశారని ఆయన వివరించారు. గుర్తింపు కలిగి వున్నప్పటికీ గుర్తింపు లేదని హాకీ ఆంధ్రప్రదేశ్ ప్రధాన కార్యదర్శి నిరంజన్‌రెడ్డి ప్రకటించడం ఆశ్చర్యం కలిగించిందన్నారు. తమ అసోసియేషన్‌పై వచ్చిన ఆరోపణలకు వివరణ ఇవ్వాల్సిన బాధ్యత తమపై వుందన్నారు. ఇందులో భాగంగానే అవసరమైన అన్ని ధృవీకరణ పత్రాలు చూపించామన్నారు. భవిష్యత్తులో ఆంధ్ర హాకీ అసోసియేషన్ తరపున మరిన్ని కార్యక్రమాలు ఏర్పాటు చేసేందుకు కృషిచేస్తామని కాకాణి చెప్పారు.

# కార్పొరేషన్ పాలన అస్తవ్యస్తం!

## స్పెషల్ ఆఫీసర్ మెతక వైఖరే కారణం



నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ పాలకవర్గం గడువు ముగిసిన తర్వాత ప్రత్యేకాధికారి పాలనలోకి వచ్చింది. ప్రత్యేకాధికారిగా నియమితులైన అదనపు జాయింట్ కలెక్టర్ సీతారామయ్య కార్పొరేషన్ పరిపాలనపై పూర్తిస్థాయిలో దృష్టి కేంద్రీకరించలేక పోతున్నారు. కార్పొరేషన్ బాధ్యతలతోపాటు వివిధ సంక్షేమ శాఖలు అమలుచేసే పథకాలను పర్యవేక్షించే అధికారం ప్రభుత్వం అప్పగించింది. ఈ క్రమంలో కార్పొరేషన్ ఆధీనంలో జరుగుతున్న కార్యక్రమాలు, సిబ్బంది పనితీరును పర్యవేక్షణ చేసే అవకాశం లేకుండా పోతుంది. ప్రత్యేకాధికారి పర్యవేక్షణ చేయకపోవడాన్ని అలుసుగా తీసుకుంటున్న కార్పొరేషన్ అధికారులు, సిబ్బంది విధులకు తరచూ డుమ్మా కొడుతున్నారు. త్రాగునీటి సరఫరాలో తీవ్ర అంతరాయం ఏర్పడుతున్నా పట్టించుకోవడం లేదు. నగరంలో చేపట్టాల్సిన సిమెంటు రోడ్ల నిర్మాణ పనులు శంకుస్థాపనలకే పరిమితమైపోయాయి. రోడ్ల పనులకు సంబంధించి ప్రభుత్వం నిధులు విడుదల చేసినా కూడా వినియోగించలేక పోతున్నారు. ప్రత్యేకాధికారి కనుసన్నల్లో పరిపాలన జరగాల్సి వున్నా సీతారామయ్య మెతక వైఖరి అవలంభిస్తుండడంతో కార్పొరేషన్ అధికారులు, సిబ్బంది ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నారు.

● నెల్లూరుకు పండుగ కళ

# ఘనంగా పెద్దపండుగ!



పెన్నాతీరాన గొబ్బెమ్మలను నిమజ్జనం చేస్తున్న మహిళలు.

పెద్ద పండుగ అయిన సంక్రాంతి పండుగను నగరవాసులు ఆనందోత్సాహాల నడుమ ఘనంగా జరుపుకొన్నారు. వివిధ ప్రాంతాలలో ఉద్యోగ, వ్యాపారాలు చేసుకొనేవారు సైతం ఈ పండుగలకు స్వస్థలాలకు రావడంతో మూడు రోజులపాటు పండుగ వాతావరణం వెల్లివిరిసింది. భోగి మంటలతో ప్రారంభమైన సంక్రాంతి పండుగ వేడుకలు కనుమతో ముగిశాయి. ఇంటి ముందు రంగవల్లులు, గొబ్బెమ్మలు, భోగిపండ్లు, బొమ్మల కొలువులతో కుటుంబసభ్యులు, బంధుమిత్రుల రాకతో సందడి నెలకొనింది. ఒకరితో ఒకరు పోటీలుపడి సంక్రాంతి సంబరాలను జరుపుకొన్నారు. పండుగ సందర్భంగా ట్రంకు రోడ్డు జనంతో క్రిక్కిరిసి పోయింది. సండే మార్కెట్, కాపువీధి తదితర గుడ్డల అంగళ్లు వుండే ప్రాంతాలైతే కోలాహలం నెలకొనింది. చివరి రోజున గాలిపటాల పండుగను చిన్నా పెద్దా అనే తారతమ్యం లేకుండా ప్రతి ఒక్కరూ ఆనందోత్సాహాలతో జరుపుకోవడం విశేషం. ఈ సందర్భంగా పలు సంస్థలు ముగ్గుల పోటీలు నిర్వహించాయి. అయితే గ్రామీణ ప్రాంతాల్లో పండుగలనాడు కన్పించే హరిదాసులు, గంగిరెద్దులు, జంగం దేవరలు నగర వాసులకు తెలియనంతగా కనుమరుగైపోవడం బాధాకరం.



సైడు కాలువల నిర్మాణం కోసం వారం రోజులు క్రితం త్రవ్వేసిన గుంటలు.

# ఇష్టమొచ్చినట్లు త్రవ్వకాలు

## శోధన్‌నగర్ వాసుల పాట్లు వర్ణనాతీతం

ప్రజల అవసరాల కోసం అభివృద్ధి కార్యక్రమాలు, నిర్మాణాలు జరపడం అందరూ హర్షించే విషయమే అయినా వారికి ఇబ్బంది కలిగించేలా వ్యవహరించడం పట్ల సర్వత్రా నిరసన వ్యక్తమౌతుంది. ఆర్టీసి వెనుక వైపు గల శోధన్‌నగర్ ప్రాంతంలో సైడు కాలువల నిర్మాణం కోసమని వారం రోజుల క్రిందట ప్రొక్లైన్లు తీసుకొచ్చి ఇష్టానుసారంగా త్రవ్వడమే కాకుండా, ఆప్రాంతంలోని చెట్లన్నింటినీ కూల్చి వేశారు. ఇంత చేసినా పనులను వేగంగా చేపట్టారా అంటే అదీ లేదు. రోడ్డును, ఇంటి ముందు వాకిళ్లను స్థలాలను ధ్వంసంచేసి పనులను చేపట్టకపోవడంతో ఆ ప్రాంత ప్రజలు పలు ఇబ్బందులు పడుతున్నారు. చివరకు పెద్ద పండుగ సమయంలో ఇళ్ల ముందు ముగ్గు పెట్టుకోలేక, భోగి మంటలు వేసుకోలేక స్థానికులు నిరుత్సాహానికి గురికావాల్సి వచ్చింది. ఇంటి నుంచి బయటకు రాకపోకలకైతే సర్కస్ ఫీట్లు చేయాల్సి వస్తోంది. ఇంత జరుగుతున్నా కాంట్రాక్ట్ తీసుకొన్న వ్యక్తి మాజీ మేయర్ భానుశ్రీ అనుచరుడు కావడంతో స్థానికులు ఏమీచేయలేక నిస్సహాయ స్థితిలో వుండిపోవాల్సి వచ్చింది. మునిసిపల్ అధికారులు జోక్యం చేసుకొని కాలువ నిర్మాణాలు త్వరితగతిన పూర్తి చేయించేలా చర్యలు తీసుకోవాలని స్థానికులు కోరుకొంటున్నారు.

● అరవింద్ నగర్‌లో

# అడ్డదిడ్డంగా త్రవ్వకాలు



రోడ్డును అడ్డదిడ్డంగా త్రవ్వేయడంతో రాకపోకలకు ఇబ్బంది మారింది.

రాజకీయవర్గాలు, అధికారుల అండదండలుంటే ఏమైనా చెయ్యొచ్చని ఎవరూ అడిగేవారు లేరనేందుకు అరవింద్‌నగర్‌లో త్రవ్వేసిన రోడ్డు ఉదాహరణ. అరవింద్‌నగర్ నుంచి మాగుంట లేఅవుట్‌కు ఒక చిన్న రహదారి వుంది. రెండు ప్రాంతాలను కలిపే ఈ మార్గం గుండా పలువురు రాకపోకలు సాగిస్తుంటారు. వారం రోజుల క్రిందట ఈ ప్రాంతంలో గల బ్రిడ్జి వద్ద కొందరు వ్యక్తులు ప్రొక్లైన్ తీసుకొని వచ్చి రోడ్డును అడ్డంగా త్రవ్వేశారు. దీంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. చుట్టూ తిరిగి పోయేకంటే ఈ మార్గం గుండా వెళితే తక్కువ దూరంలో వెళ్లవచ్చునని ఈ ప్రాంతం నుంచి వచ్చిపోయేవారు త్రవ్వేసిన రోడ్డు మూలంగా రాకపోకలు సాగించలేక పోతున్నారు. ఈ సమస్యను పట్టించుకొనేవారే లేకపోవడంతో రెండు ప్రాంతాల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తుంది.

## ఆత్మగౌరవాన్ని దెబ్బతీశారు

మొదటి పేజీ కొరవ

పట్ల పూర్తిస్థాయి విధేయత ప్రదర్శించడమే అని భావించవలసి వస్తున్నది. తతిమా రాష్ట్రాలలో కాంగ్రెస్ నేతలు సోనియా గాంధీని బెదిరించి మరీ పనులు చేసుకొంటారు. కానీ మన వారు అయ్యా అమ్మ అని చేతులు కట్టుకొని నిలబడడం తప్ప మాటకు ఎదురు చెప్పే సాహసం కూడా చేయరు. తెలంగాణ, ఆంధ్ర వివాదం తలెత్తితే, మేము చెప్పేవరకు ఎమ్మీలెవరూ నోరెత్తి మాట్లాడడానికి లేదని శాసించాడు అహ్మద్ పటేల్. తెలంగాణ ఎమ్మీలు ఆ ఆజ్ఞను ధిక్కరించారు. కానీ ఆంధ్ర ప్రాంతం ఎమ్మీలు మాత్రం బుద్ధిగా మసలుకొన్నారు. వీరెవరికీ వెన్నెముక లేదు కాబట్టి, తామేమి చేసినా ఇబ్బంది వుండదనే అలసత్వం అధిష్టానాన్ని ఆవహించినట్లుంది.

### ఎవరికిస్తే ఏ సమస్యో?

రాష్ట్రం నుంచి కొత్తగా మంత్రిపదవులిస్తే, ఆంధ్ర తెలంగాణ ప్రాంతాలకు ఎట్లా కేటాయింపులు చేయాలన్న మీమాంసతోనే మొత్తం అందరికీ ఎగనామం పెట్టారని పరిశీలకుల అభిప్రాయం. తెలంగాణ వాళ్లకు ఇస్తే, ఆంధ్రలో సమస్య తలెత్తుతుందని, ఆంధ్ర వాళ్లకిస్తే తెలంగాణ వాదులు రెచ్చిపోతారని భయపడిందట సోనియాగాంధీ. అందువల్ల ఇద్దరినీ పక్కన పెట్టారు.

### ఆత్మగౌరవ భంగం

దీనివల్ల ఆంధ్ర రాష్ట్రమంటే ఢిల్లీ దొరలకు తేలికభావమనే అభిప్రాయం ప్రచారమౌతున్నది. ఇప్పటికే ఆంధ్రుల ఆత్మగౌరవం దెబ్బ తిన్నదని గోల చేసేస్తున్నాడు వైఎస్. జగన్. ఆయన మాట నిజమే అని నిరూపించింది సోనియాగాంధీ. తమ వూళ్లకు వెళ్లి తలెత్తుకొని ఎట్లా తిరగాలో అర్థంకాక మధన పడుతున్నారు ఎమ్మీలందరూ.

### ప్రమోషన్ కాదు డిమోషన్

జైపాల్‌రెడ్డికి పెట్రోలియం శాఖ ఇచ్చి, ఆంధ్ర నేతకు ప్రమోషన్ కల్పించామని ఒక వాదన ముందుకు తెస్తున్నారు ఢిల్లీ పెద్దలు. కానీ నిశితంగా పరిశీలించి చూస్తే, అది డిమోషనే తప్ప ప్రమోషన్ కాదని అర్థమౌతుంది. జైపాల్‌రెడ్డి ఇప్పటివరకు పట్టణాభివృద్ధి శాఖ మంత్రిగా వుండినాడు. వేల కోట్ల రూపాయల బడ్జెట్ వున్న శాఖ అది. దానిపై జైపాల్‌రెడ్డికి పూర్తి నియంత్రణ వుండేది. తనకు నచ్చిన పట్టణాలకు నేరుగా నిధులు ఇచ్చేవాడు. పెద్ద పెద్ద కాంట్రాక్టర్లు ఆ శాఖలో పనులు చేస్తున్నారు కాబట్టి, నీతిమంతుడు అన్న ముద్ర చెడకుండా జేబు నిండేది. కానీ పెట్రోలియం శాఖలో ఆ స్వేచ్ఛ లేదు. పదంటే పది ఆయిల్ కంపెనీల పై పెత్తనం మాత్రమే ఆ శాఖ చేసే పని. వారిలో అంబానీ వంటి పారిశ్రామికులున్నారు. మంత్రిగా వారికి సహాయం చేయడం తప్ప, ప్రజలకు చేసే పనంటూ వుండదు. పైగా పెట్రోల్ ధరలు పెంచినప్పుడల్లా జనం చేత తిట్లు తినాలి. పైకి పెద్ద పోర్టుఫోలియో వచ్చిందని ప్రచారం చేసుకొంటున్నప్పటికీ, జైపాల్‌రెడ్డికి కూడా తనను దెబ్బ కొట్టారని బాగా తెలుసు.

### వ్రతం చెడినా ఫలం దక్కలేదు

తెలంగాణవాదులు ఇప్పుడు రెంటికీ చెడిన రేవడులైనారు. మంత్రివర్గ విస్తరణతో తమకు అవకాశం వస్తుందనే ఆశతో, గత వారం రోజులుగా చాలా మంది ఎమ్మీలు నోరు జారారు. అంజన్ కుమార్ యాదవ్, వి.హనుమంతరావు, సర్వే సత్యనారాయణ, జి.వివేక్ వంటివారు, తెలంగాణ ఉద్యమకారులతో వాదన పెట్టుకొన్నారు. తెలంగాణ ఉద్యమం కోసం మంత్రిపదవులు త్యాగం చేయమని తమను కోరడానికి వచ్చిన వారితో గొడవ పెట్టుకొని, ఉద్యమానికి పదవులకు సంబంధం లేదని వాదించి, తాము పదవులు తీసుకొంటామని ప్రకటించారు. దానితో వారి పట్ల తెలంగాణలో చులకన భావం ఏర్పడింది. ఉద్యమకారులు వారిని తమ శత్రువులుగా చూస్తున్నారు. సోనియాగాంధీ మాత్రం పదవులు ఇవ్వలేదు. వ్రతం చెడినా ఫలితం దక్కని అభాగ్యులై పోయారు వారంతా.




## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### కాకాణి వేణుగోపాల్‌రెడ్డి మరణం

నార్తుమోపూరులో భూస్వామ్య కుటుంబీకుడైనా సామాన్య ప్రజలకు ఎన్నో మేళ్లు చేసిన కాకాణి వేణుగోపాల్‌రెడ్డి(92) 11వ తేదీ నెల్లూరులో మరణించారు. వేణుగోపాల్‌రెడ్డి మోపూరులోని తన స్వంత ఇంటిని స్కూల్ పెట్టుకోను దానంగా ఇచ్చేశారు. మరో భవనాన్ని పంచాయతీ కార్యాలయ నిర్వహణకు ఇచ్చారు. మోపూరు సొసైటీ అధ్యక్షునిగా వ్యవహరించిన సమయంలో ధాన్యం నిల్వకు గోడౌన్లు కట్టించారు. పశువుల ఆసుపత్రి నిర్మాణం ఈయన చలువే. గ్రామంలోని హరిజన, అరుంధతీయవాడల్లో మంచినీటి బావులు త్రవ్వించడమే గాక, ప్రక్క గ్రామం భట్రకాగొల్లుకు రోడ్డు వసతి కల్పించిన మంచి మనిషి వేణుగోపాల్‌రెడ్డి. అన్న మరణం ఆయన తమ్ముడు కాకాణి పాండురంగారెడ్డి తట్టుకోవడం కష్టమే.

### అరుణ గ్రాఫిక్స్ ముక్కంటి రాజు మరణం

అందమైన అచ్చు పనులకు నెల్లూరులో తిరుగులేని చిరునామా అరుణ గ్రాఫిక్స్ అధినేత బుక్కరాజు ముక్కంటి రాజు(81) 15వ తేది మరణించారు. ముక్కంటి రాజు బహుముఖ ప్రజ్ఞాశాలి. వామపక్ష భావాలు మెండుగా వున్న ఆయన మరణించే వరకు సిపిఐ పార్టీలో కొనసాగారు. నెల్లూరు అర్బన్ బ్యాంక్ డైరక్టర్‌గా చాలా రోజులు పనిచేశారు. నెల్లూరులో బిసి ఫెడరేషన్‌తోపాటు, రాష్ట్ర స్థాయిలో భట్రాజుల సంఘానికి విశిష్ట గుర్తింపు తెచ్చారు. రాజుకు ఇద్దరు కుమారులు. ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమారుడు బాబు మరణం ఆయన్ను బాగా కుంగదీసింది. లేకుంటే ఆయన మరికొన్నాళ్లు జీవించి వుండేవారు.

ఆత్మీయులను కోల్పోయిన పై నాలుగు కుటుంబాల వారికి మా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాము.

## తోడేళ్ల గుంపు

16వ పేజీ కొరవ

కాలేజి అండ్ హైస్కూల్ కమిటీ బైలాస్‌ను మార్చి, అది తమ స్వంత సంస్థగా రికార్డు సృష్టించే ప్రయత్నం చేస్తున్నాడు.

అమెరికన్ ఆస్పత్రి స్థలాన్ని ముక్కలు ముక్కలుగా విభజించి అమ్మకం మొదలు పెట్టారు. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి భాగస్వామ్యంతో, తమిళనాడు హైకోర్టు నుంచి మాయోపాయంతో తెచ్చుకొన్న ఒక ఉత్తర్వును సాకుగా చూపించి, చరిత్ర కలిగిన ఆ స్థలాన్ని ఒక వైశ్య వ్యాపారి అమ్మకానికి పెట్టారు. అంకణం రెండు లక్షల లెక్కన జరుగుతున్నదీ అమ్మకం. క్రిస్టియన్ మిషనరీల సేవా త్యాగాలకు ప్రతిరూపమైన ఉత్కృష్ట సంస్థ అమెరికన్ ఆస్పత్రి. కొన్ని దశాబ్దాల పాటు లక్షలాది మంది జిల్లా ప్రజలకు స్వస్థత చేకూర్చిన ఆస్పత్రి అది. దాన్ని కూడా తమ భూదాహానికి బలి చేస్తున్నాడు ఆనం రామనారాయణ రెడ్డి.

వీటికి సంబంధించిన ఆధారాలతో పూర్తి వివరాలు పైవారం ప్రచురిస్తాము. ఇప్పటి వరకు తెలుస్తున్న సమాచారాన్ని బట్టి చూసినా ఆనం సోదరులు తోడేళ్ల గుంపు కంటే హీనంగా వ్యవహరిస్తున్నారని అర్థమౌతున్నది. జనంలో తిరుగుబాటు వంటిదేదో వస్తే తప్ప ఈ దుర్మార్గాలు ఆగవు.

## సి.కళ్యాణ్

మొదటి పేజీ కొరవ

8 అపార్టుమెంట్లు కట్టించారట వీరిద్దరూ కలిసి. వేమలశెట్టి బావి సత్రం దగ్గరున్న ముస్లింల సమాధులను ఆక్రమించి, అది తన స్థలంగా ప్రకటించుకొని, ప్రహరీ గోడ నిర్మించిన సంఘటన కూడా పోలీసు దృష్టికి వచ్చింది. ఈ స్థల దురాక్రమణలో అప్పటి మేయర్ భానుశ్రీకి పాతిక వంతు వాటా ఇచ్చాడని, దానితో అధికారులెవరూ ఆ ఆక్రమణను అడ్డుకోవడానికి సాహసించలేక పోయారని అందరికీ తెలుసు. ఇప్పుడు పోలీసులు ఆ స్థలం మీద దృష్టి పెట్టారు.

కళ్యాణ్ తలమంచి గ్రామవాసి. అయితే నెల్లూరు నగరంలో పెరిగాడు. అల్లరి చిల్లరిగా తిరిగేవాడు. హైదరాబాదుకు వెళ్లి ఒక్కసారిగా సినీ నిర్మాతగా ఎదిగిపోయాడు. ఈ అనూహిత పెరుగుదల వెనుక ఇంతటి నేరచరిత్ర దాగి వుండడం విస్మయం కల్గించే అంశం.

## జనవాణి

2వ పేజీ కొరవ

రాల శాఖ అధికారికి కూడా తెలిసి వుంటుంది. జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ ప్రత్యేక శ్రద్ధ తీసుకొని కూరగాయల మార్కెట్‌ను చక్కదిద్దాల్సిన అవసరం వుంది.

పి.అరుణకుమారి నెల్లూరు

### రేషన్ డీలరుతో ఇక్కట్లు!

విడవలూరులోని 26 నెంబరు చౌకధరల దుకాణం డీలరు సరిగ్గా సరకులు ఇవ్వడం లేదు. ఇదేమిటని అడిగితే దిక్కున్నచోట చెప్పుకోమంటారు. బియ్యం, కిరోసిన్, చక్కెర, పామాయిల్ ఒకేసారి ఇవ్వరు. నెలలో పదిరోజులు పని మానుకొని వీటి కోసం తిరగాలి. ఊరికి దూరంగా ఈ షాపు వుంది. మండల రెవిన్యూ అధికారులకు ఈ డీలరు నిర్వాకం గూర్చి తెలియజేసినా తగిన చర్యలు లేవు. జాయింట్ కలెక్టర్ ఈ విషయమై విచారణకు ఆదేశిస్తే బాగుంటుంది.

కె.కామేశ్వరి విడవలూరు

## కాంగ్రెస్ కొంప ఖాళీ

5వ పేజీ కొరవ

సంఖ్య కొంత తగ్గింది. గోవర్ధన్‌రెడ్డి నిష్క్రమణ జిల్లాలో కాంగ్రెస్ పార్టీకి శరాఘాతం వంటిది. 1969లో అప్పటి జిప ఛైర్మన్ నల్లపరెడ్డి చంద్రశేఖర్ రెడ్డి కాంగ్రెస్‌ను ఇదే తీరులో చావు దెబ్బ కొట్టాడు. ఆ రోజులలో దాన్నొక రాజకీయ విప్లవంగా భావించారు. ఇన్నేళ్ల తర్వాత మరొకసారి అటువంటి భూకంపమే సృష్టిస్తున్నాడు గోవర్ధన్‌రెడ్డి. ఒక్క మాటలో చెప్పాలంటే కాంగ్రెస్ కొంపను ఖాళీ చేశాడన్న ప్రతిష్ట సంపాదించుకొంటున్నాడు. మేకపాటి సోదరులు మొదట నుంచి జగన్‌తోనే వున్నా, వారికి జిల్లా రాజకీయాలలో పెద్దగా పలుకుబడి లేదు కాబట్టి, ఇంతకాలం జగన్ పార్టీకి అనుకొన్న వూపు రాలేదు. గోవర్ధన్‌రెడ్డి చేరికతో ఆ కొరత తీరబోతున్నది. పార్టీ మార్పిడి వల్ల గోవర్ధన్‌రెడ్డికి దక్కే రాజకీయ లాభ నష్టాలు ఎట్లా వుంటాయో కాలమే నిర్ణయిస్తుంది. కానీ ఒక్క వ్యక్తి వల్ల జిల్లాలో ఇంత పెద్ద పార్టీ దెబ్బతిని పోయిందనే అభిప్రాయం కల్గించడం మాత్రం గోవర్ధన్‌రెడ్డిని జిల్లా రాజకీయ చరిత్రలో గౌరవనీయ స్థానంలో నిలబెడుతుందన్నది నిజం.

# ప్రజలపై మళ్లీ పెట్రోభారం!

## ధరలు పెంచడం అన్యాయం



ఆయిల్ కంపెనీలు పెట్రోల్ ధరలు పెంచి సామాన్య ప్రజలపై అదనపు భారం మోపాయి. సంవత్సర కాలంలో దాదాపు ఏడు సార్లు పెట్రోల్ ధరలు పెరిగాయి. ఆయిల్ కంపెనీలు ఇష్టానుసారంగా ధరలు పెంచుతున్నప్పటికి కేంద్రప్రభుత్వం నియంత్రించకపోవడం బాధాకరం. ఇప్పటికైనా కేంద్రం స్పందించి ధరలు తగ్గించాల్సిన అవసరం వుంది.

– **చంద్రశేఖర్,** నెల్లూరు.

## అదనపు భారం పడింది



నూతన సంవత్సరం కానుకగా ఆయిల్ కంపెనీలు పెట్రోల్ ధరలు పెంచి ప్రజలను ఇబ్బందులకు గురి చేశాయి. ఒక ప్రక్క నిత్యావసర వస్తువులు, కూరగాయల ధరలు పెరిగి సతమతమవుతున్నాం. మరో ప్రక్క పెట్రోల్ ధరలు పెరగడంతో వాహనాలు తిప్పే పరిస్థితి కనిపించడం లేదు. ధరలు తగ్గించేందుకు అన్ని రాజకీయ పార్టీలకు చెందిన నేతలు కేంద్రంపై మరింత ఒత్తిడి తీసుకురావాల్సిన బాధ్యత వుంది.

– **ముజీబ్,** నెల్లూరు.

కేంద్ర ప్రభుత్వం మరోసారి పెట్రోభారం మోపింది. గత సంవత్సరం నాలుగు దఫాలుగా పెట్రోల్, డీజిల్ ధరలు పెరిగాయి. ఈ సంవత్సరం ప్రారంభంలోనే మళ్లీ పెట్రోల్ ధరలు పెంచడంతో వాహనదారులపై అదనపు భారం పడింది. పెట్రోల్ ధరలు పెంచుకునే అవకాశం ఆయిల్ కంపెనీలకు అప్పగించడంతో ఆయా కంపెనీలు ఇష్టానుసారంగా ధరలు పెంచుకొంటూపోతున్నాయి. నెల్లూరు జిల్లాలో దాదాపు 180కిపైగా పెట్రోల్ బంకులున్నాయి.

క్రొత్త సంవత్సరంలో పెట్రోల్ ధరలు పెంచిన కేంద్రం త్వరలో డీజిల్, వంట గ్యాస్‌పై కూడా ధరలు పెంచే అవకాశం వుంది. ఒక ప్రక్క ఇప్పటికే నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటి కొనుగోలు చేయలేని పరిస్థితి వుంటే మరొక ప్రక్క పెట్రోల్ ధరలు పెంచి వాహనదారులను మరింత ఇబ్బందులకు గురి చేసింది ప్రభుత్వం. ఆయిల్ కంపెనీలపై కేంద్రప్రభుత్వం నియంత్రణ లేకపోవడమే ధరల పెరుగుదలకు కారణమని పలు రాజకీయ పార్టీల నేతలు విమర్శలు చేస్తున్నారు. పలు దఫాలుగా పెంచిన పెట్రోల్ ధరలపై దేశవ్యాప్తంగా అన్ని వర్గాల ప్రజలు ఆందోళన చేపట్టి నిరసనలు వ్యక్తం చేశారు.

ప్రజల వద్ద నుంచి ఎంతగా నిరసన వ్యక్తం అవుతున్నా కేంద్ర ప్రభుత్వంలో ఏ మాత్రం స్పందన రావడం లేదు. అధికార పార్టీకి చెందిన నేతలు సైతం పెరిగిన ధరలపై ప్రభుత్వాన్ని ప్రశ్నించడం లేదు. పెరిగిన పెట్రోల్ ధరల కారణంగా జిల్లా ప్రజలు నెలకు కోటిరూపాయలకు పైగా అదనపు భారం మోయాల్సి వచ్చింది. లీటర్ పెట్రోల్ రూ. 62.50 పైసలుండేది. తాజాగా ఆయిల్ కంపెనీలు రూ.2.81పైసలు పెంచాయి. ప్రస్తుత ధర రూ.65.31 పైసలు. రోజుకు జిల్లావ్యాప్తంగా లక్షలీటర్లకు పైగా పెట్రోల్ వినియోగం జరుగుతుంది.




*ద్విచక్ర వాహనాలపై సవారీ కష్టమే.*

ఈ సమయంలో పెట్రోల్ ధర పెరగడంపై వాహదారులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఈ సందర్భంగా పెట్రోల్ ధర పెంపు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అవలంభిస్తున్న విధానాలపై పలువురు వెల్లడించిన అభిప్రాయాలు ప్రక్కనిస్తున్నాం.

# తుఫాను నాటకంలో నెల్లూరు మాండలీకానికి పట్టాభిషేకం!

ఆధునిక కాలంలో తెలుగు నాటకరంగంలో నెల్లూరు కళాకారులు గణనీయమైన పాత్ర పోషించారు. క్రీ.శ 1918–20 ప్రాంతాలలో నెల్లూరు ఆంధ్రసభ ఎన్నో నాటకాలను ప్రదర్శించింది. ఘంటసాల బలరామయ్య, పొణకా కనకమ్మ, బళ్లారి రాఘవ, వేదం, ఆత్రేయ, వేంకటరంగయ్య, రమణారెడ్డి, నాగభూషణం, గంగారత్నం, స్నేహలతారెడ్డి, నెల్లూరు వెంకట్రామానాయుడు, పులుగుండ్ల రామకృష్ణయ్య, గూడూరు సావిత్రి వంటి హేమాహేమీలు వివిధ రూపాలలో నాటక, గేయ ప్రక్రియకు ఇతోధికంగా తమ వంతు సహకారాన్ని అందించారు. ఇవన్నీ ఒక ఎత్తు అయితే నెల్లూరు మాండలికానికి కనకాభిషేకం చేసిన నాటకం 'తుఫాను'! ఇందులో నెల్లూరు మాండలికం 'తుఫాను' హోరులాగానే వినిపిస్తుంది. నెల్లూరు మాండలికం సొబగులు, పదపదాలలోనూ వీరవిహారం చేస్తాయి. ఈ నాటకాన్ని 1946 నవంబరులో పులుగుండ్ల రామకృష్ణయ్య అను రచయిత రాశారు. ఆంధ్ర సభ వారు ఈ నాటికను నెల్లూరులో అక్టోబరు 19, 1947 దసరా ఉత్సవాలలో ప్రదర్శించారు. విజయవాడ ఆంధ్ర నాటక పరిషత్‌లో ఈ నాటిక జనవరి 15, 1948న ఉత్తమ రచన రివార్డును అందుకొంది.

1952లో మొదటి ముద్రణను, తర్వాత 1955లో ద్వితీయ ముద్రణను, 1976 తృతీయ ముద్రణను పొందిన 'తుఫాను' నాటిక ఆ తర్వాత ముద్రణకు నోచుకోక తెరచాటుకు వెళ్లి పోయింది. నెల్లూరుజిల్లా సజీవ మాండలిక భాషాపదకోశం 'తుఫాను' నాటికని నా నిశ్చితాభిప్రాయం. ఇందులోని రాఘవరెడ్డి, కుప్పుస్వామి, భద్రయ్య, గోపాల్‌రెడ్డి, రమాదేవి పాత్రలు నెల్లూరీయుల ప్రతి రూపాలుగా మనకు దర్శనమిస్తాయి. ఇందులో రాఘవరెడ్డిది నెల్లూరు మోతుబరి రెడ్డి పాత్ర. ఈ పాత్రకు గాడేపల్లి రామయ్య ప్రాణం పోశాడు. ఆద్యంతం నెల్లూరు యాస ఈ పాత్ర నోట జాలువారుతుంది. ఇక కుప్పుస్వామి పాత్ర తెలుగు తమిళ యాసలతో హాస్యరసాల్నొలికిస్తుంది. కథ నేపథ్యానికి వస్తే రాఘవరెడ్డి కుమారుడు గోపాల్‌రెడ్డి, కుప్పుస్వామి కుమార్తె రమ ప్రేమించుకుంటారు. రంగస్థలం చెన్నపురి. రాఘవరెడ్డి, కుప్పుస్వామి తమ పిల్లల్ని ఒకరికొకరికి ఇచ్చి వివాహం చేయాలనుకుంటారు. పిల్లల వ్యవహారం పెద్దలకుగానీ, పెద్దల వ్యవహారం పిల్లలకు తెలియక అందరి మధ్య 'తుఫాను' ఏర్పడుతుంది. చివరికి విషయం తెలిశాక నాటకం సుఖాంతమై 'తుఫాను'లా వెలిసి పోతుంది. ఇది సూక్ష్మంగా కథాసారాంశం.

నెల్లూరు మాండలిక పదాలకు సినీరంగంలో తిక్కవరపు రమణారెడ్డి ఎలా జీవంపోశారో, నాటకరంగంలో తుఫాను నాటకంలో రాఘవరెడ్డి పాత్రకు గాడేపల్లి రామయ్య అంతగా కీర్తిప్రతిష్టలు తెచ్చిపెట్టారు. గాడేపల్లి రామయ్య హావభావ ప్రకటనలలోనూ, వాచకంలోనూ నెల్లూరు యాసను ప్రస్ఫుటంగా ప్రజ్వలింపజేసి కరతాళధ్వనులను అందుకొన్నారని ముందు తరంవారు చెబుతారు. చాలా పదాలకు ఊత పదంలా 'గదో' అనే వాచ్యం, చెప్తుళ్లా మాటలో మనగాళ్లుగదో అనే ఉచ్ఛారణలతో రామయ్య సభికుల్ని ఆకట్టుకోగా. కుప్పయ్య పాత్ర తమిళ యాసలో తెలుగు పదాలకు హాస్యాన్ని చేకూరుస్తుంది. "మీరంతా సౌఖ్యందానే, తొందరజేస్తురు, గోషా వుండాదని తలిస్తిరా, నిండాజొస్తిని, పూడవండి, నిండా అనుమానందా' అనే యాసతో సభికులకు హాస్యాన్ని అందిస్తుంది. రాఘవరెడ్డి పాత్ర డైలాగుల్లో కనిపించే నెల్లూరు మాండలికాలు పాత్రధారి హావభావ విన్యాసాలతో మరింతగా సభికుల్ని రంజింపజేస్తాయని ఒకచోట డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారంటారు.

**పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**

తుఫాను నాటకాన్ని ఓ విలక్షణ నాటకంగానూ, నెల్లూరు మాండలికానికి ప్రాణనిదానంగాను కీర్తించిన వారిలో దుర్భా సుబ్రహ్మణ్యశర్మ, మరుపూరు కోదండరామిరెడ్డి, నెల్లూరు రామానాయుడు, మోచర్ల రామకృష్ణయ్య, రేబాల లక్ష్మీనరసారెడ్డి, చుండి విశ్వనాథం మొదలైన దిగ్గంతులంతా వున్నారు. నాటకంలోని కొన్ని రాఘవరెడ్డి పాత్రోచిత సంభాషణల్ని చూద్దాం. కుప్పయ్య తన కుమార్తెను రాఘవరెడ్డి కుమారుడికివ్వడాన్ని ప్రస్తావిస్తే రాఘవరెడ్డి అంటాడు కదా? "ఆచ్చాపణే వుండది. చెప్తినే, మాటలిస్తినే" అంటాడు. ఓ రిక్షావాడు రెడ్డి దిగిం తర్వాత బేరం బెడితే "ఆరణాలిస్తే జాలదంట్నే, రూపాయిలిస్తా, తీసుకొందువులే" అని ఎకసెక్కమాడుతాడు. "ఏవీ ఆచ్చాపణే వుండది, తెంపు జేసినావే ఇయ్యమంటుండావే నీదేం బోద్ది?" అని తన అసిస్టెంటును కూడా గదమాయిస్తాడు. "పట్నంవాస వాళ్లగదో, బహు సున్నితం గదో మాదేంది ఎండనా, గాలినా దిరిగే వాళ్లం" అంటాడు తన మిత్రుడు కుప్పయ్యతో ఓ సందర్భంలో. "కార్లులేంది మీరు కాలు బయట పెడ్తారంటయ్యా? మాదేంది, ఎట్టబడ్తే అట్ట బొయ్యేదే గదో" అంటాడు మరో సందర్భంలో.

ఇలా సాంప్రదాయబద్ధమైన నెల్లూరు మాండలికాలు ఈ నాటకంలో నాలుగైదు వందల పదాలు కనబడ్తాయి. రాష్ట్రంలోని అన్ని జిల్లాల మాండలికాలు బహుళవ్యాప్తిలో వున్నాయి. తెలంగాణా, రాయలసీమ, మాండలికాలైతే సరేసరి!ఆ మధ్య, ఈ మధ్య నెల్లూరు మాండలికంలో వచ్చిన రచనలు చాలా చాలా తక్కువ. ఇటీవల సం.వేం. రమేష్ ప్రళయకావేరి కథలు నెల్లూరుజిల్లా సూళ్లూరుపేట మాండలీకం రుచులను నెల్లూరీయులకు రుచి చూపించాయి. నెల్లూరు మాండలికంలో ఒకరిద్దరు కథలు వ్రాశారు. దీన్నిబట్టి నెల్లూరు మాండలికం సరైన రీతిలో ప్రచారం చెందలేదన్నది, నెల్లూరులో చాలామంది రచయితలుండి కూడా కనీస ప్రయత్నం చేయలేదన్నది నా బాధ. 1976 ప్రచురణతో ఆగిపోయిన 'తుఫాను' నాటకాన్ని నెల్లూరు మేధావి రచయితలుకానీ, ప్రచురణ సంస్థలు కానీ పూనుకొని ప్రచురించాలన్నది నా హృదయపూర్వక విన్నపం!

Regn.No. : RN 1156 / 57    J/Nellore/008/09-11

# నెల్లూరు నగరం మీద తోడేళ్ల గుంపు దాడి!

నెల్లూరు నగరం మీద తోడేళ్ల గుంపు ఒకటి దాడి చేస్తున్నది. ఇవి అడవుల నుంచి వచ్చిన అమాయక మృగాలు కాదు. శక్తి యుక్తులున్న రాజకీయ తోడేళ్లు. అధికారమనే కోరలతో, అధికారుల వత్తాసనే గోళ్లతో వూరి మీద విరుచుక పడుతున్నాయవి. అడవులలో తిరిగే మృగాల రక్త దాహం, వాటి ఆకలి తీరగానే సమసి పోతుంది. కానీ ఈ రాజకీయ మృగాల అవినీతి దాహానికి అంతమనేదే వుండదు. ఎంత దోచుకొంటే ఇంకంతగా ఆ దప్పిక పెరిగిపోతుంది.

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఆయన సోదరుడు ఆనం వివేకానందరెడ్డి, వారి ద్దరి సోదరులు, వారి అనుచరులు నెల్లూరు నగ రంలో చేస్తున్న అరాచకాలను చూస్తే, తోడేళ్ల గుంపు కంటే ప్రమాదకరంగా కన్పిస్తున్నది. వూరిలో వుండే ప్రభుత్వ స్థలాలు, ప్రజల ఆస్తులను అమాంతం కబళించడానికి నిస్సిగ్గుగా, పరమ జుగుప్సా కరంగా ప్రయత్నం చేస్తున్నారు వారు. ప్రైవేటు ఆస్తులను కూడా వదలి పెట్టడం లేదు. ఒక్క అధి కారి కూడా వారి దుర్మార్గాలను అడ్డుకొనే స్థితిలో లేదు. అందరూ వారికి దాసోహం అంటున్నారు. సిపిఎం, తెలుగుదేశం, బిజెపి వంటి ప్రతిపక్ష పార్టీలు చేవచచ్చి పోయివున్నాయి. అధికారంలో వుండే వారికి ఎదురు నిలవాలంటే వారి పంచెలు, ప్యాంట్లు తడిచిపోతున్నాయి. దానితో ఆనం సోద రులు తోడేళ్ల కంటే హీనంగా, దారుణంగా వూరిని దోచుకోవడానికి సాహసిస్తున్నారు. వారి దుర్మా ర్గాలు వింటుంటే ఒళ్లు కంపరమెత్తి పోతున్నది.

నెల్లూరు పెద్దాస్పత్రిని కబళించడానికి ఆనం రామనారాయణరెడ్డి పథకం సిద్ధం చేసుకొన్నట్లు తెలుస్తున్నది. దాదాపు 90 ఎకరాల సువిశాల స్థలంలో నెలకొని వున్న ఈ ప్రజా సంస్థను తన పరం చేసుకోవడానికి పావులు కదుపుతున్నాడా ప్రబుద్ధుడు. మెడికల్ కాలేజి పెట్టే పేరుతో జరుగు తున్నదీ కుట్ర.

మద్రాసు బస్టాండ్ పక్కన, జీబులాస్పత్రిని ఆనుకొని వున్న తిక్కవరపు సుదర్శనమ్మ మహిళా సభ ప్రాంగణాన్ని తన పరం చేసుకొంటున్నాడు ఆనం వివేకానందరెడ్డి. రెండెకరాల విస్తీర్ణంలో నెలకొని వున్న ఈ సంస్థకు ఉత్కృష్టమైన చరిత్ర వుంది. దాన్ని కాలగర్భంలో కలిపేసి, ఆ స్థలంలో అంగడి గదులు కట్టి మార్కెట్ వ్యాపారులకు బాడుగకు ఇచ్చుకోవడానికి కుట్ర పన్నుతున్నాడు వివేకానందరెడ్డి. ఇప్పటికే దాన్ని తన స్వాధీనంలో తెచ్చుకొని, ప్రహరీ గోడ కట్టి, పెద్ద గేట్ కూడా పెట్టించాడు.

విఆర్ కాలేజి ఆస్తులను తన కుమారుడికి కానుకగా ఇవ్వడానికి మరొక ప్రయత్నం చేస్తున్నాడు ఆనం వివేకానందరెడ్డి. అందుకోసం నూరేళ్లనాటి విఆర్

కొరవ 14వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.